THE ANDHRA PATRIKA, MADRAS.



# ఆంధ్రపత్రిక



Regd. No. M, 1118 సంపుటం 38. సంచిక 177 FOUNDER : DESODHARAKA K. NAGESWARA RAO. శుక్రవారం 28-9-1951 వెల 1 అణా, హోరీ 0-1-2.

# విదేశీ సేన దిగితే దక్షిణ ఇరాన్ నూనెగనులను నేలమట్టం చేయాలని నిర్ణయం?

## ఫక్తూనిస్థాన్ ఉద్యమ బహుముఖ వ్యాప్తి

### పాకిస్థాన్ లొంగకతప్పదని కాబూల్ రేడియో

కాబూల్, సెప్టెంబరు 26: "ఫక్తూనిస్థాన్ ఉద్యమం ఇప్పుడు అజాద్ ఫక్తూనిస్థాన్‌కు అనగా కొండజాతి ప్రాంతాలనబడే ప్రదేశానికి మాత్రమే పరిమితమై లేదు. సరిహద్దు రాష్ట్రంలోను బెలూచిస్తాన్‌లోను బ్రిటిషువారి హయాములో అడ్మినిస్ట్రేటెడ్ ప్రాంతాలని వ్యవహరించబడుతూ వచ్చిన ప్రాంతాలకు కూడా ఈ స్వాతంత్ర్యోద్యమం ఇప్పుడు పాకింది. స్వాత్, దీర్, బజార్, చిత్రాల్ మొదలైన సరిహద్దు సంస్థానాల ప్రజలూ, బెలూచిస్తాన్ సంస్థానాల ప్రజలూ కూడా ఈ ఉద్యమాన్ని బలపరుస్తున్నారు." అని కాబూల్ రేడియో ఈ వేళ ప్రకటించింది.

"ఈ స్వాతంత్ర్యోద్యమాన్ని ఏ విధంగానైనా ప్రతిఘటించి చేయాలనే ఉద్దేశ్యంతో పాకిస్తాన్ ప్రభుత్వం స్థానిక ప్రజలను నానాహింసలు పెడుతూ నిర్దాక్షిణ్యంగా అణచివేయడమే గాక ఆఫ్ఘనిస్తాన్‌మీద దుష్ప్రచారం సాగించేందుకు ఆఫ్ఘనిస్తాన్ స్వాతంత్ర్యోద్యమసంఘం అనే పేరుతో ఒక కమిటీనికూడా నియమించింది. ఆఫ్ఘనిస్తాన్‌లో ఇదివరకు తమ తెరపుగూఢచారులుగా పనిచేసిన ఆరు ఏడుమంది వ్యక్తులతో ఈ కమిటీ స్థాపించబడింది, హాటీబీ అనే కాండహార్ ఎమ్. పి. ఒకడు ఈ కమిటీకి నాయకుడు. ఆఫ్ఘనిస్తాన్ అసెంబ్లీలో ఈయన పాకీస్తాన్ తరఫున పంచమాంగదళ సభ్యుడుగా పనిచేస్తూ, ఇటీవల ఈ దేశంనుంచి పరారీ అయిపోయినాడు. దుష్ప్రవర్తనకు కాబూల్ విశ్వవిద్యాలయంనుంచి బహిష్కరించబడిన విద్యార్థులు కూడా నలుగురు ఐదుగురు ఈ కమిటీలో సభ్యులుగావున్నారు. ఇలాంటి దుండగులతోను, నేరస్థులతోను కూడిన ఈ కమిటీ ఆఫ్ఘన్ జాతికి ప్రతినిధులట. తన ఈ అసత్య ప్రచారాన్ని లోకం నమ్ముతుందనుకోవడం వెర్రితనం తప్ప మరొకటి కాదు."

### ఫక్తూన్లకు కాశ్మీర్ ప్రధాని అబ్దుల్లా సందేశం

శ్రీనగర్, సెప్టెంబరు 25 "ఫక్తూన్లకూ కాశ్మీరీలకూ ఈ నాడు ఒక విచిత్రమైన పరిస్థితులు ఏర్పడివున్నాయి; పాకిస్తాన్ కాశ్మీర్‌కు వలెనే ఫక్తూనీస్థాన్‌కు స్వయం నిర్ణయాధికారం ఇవ్వడానికి నిరాకరిస్తున్నది. బాద్షాఖాన్ నాయకత్వాన ఫక్తూనులు సాగిస్తున్న రాజకీయోద్యమాన్ని చూసి కాశ్మీరీలు అనాదినుంచి ధైర్యప్రోత్సాహాలతో ఉద్దీపితులౌతూ వచ్చారు. ప్రస్తుతం అయినా, అయినసహచరులూ పాకిస్తాన్ ప్రభుత్వం చేతిలో ఎన్ని బాధలు పడుతున్నప్పటికీ, అంతిమంగా వారికి జయం కలుగుతుందనడానికి సందేహం లేదు. ఎందువల్లనంటే న్యాయమూ సత్యమూ ఇవాళ గాకపోతే రేపటికైనా నెగ్గి తీరుతాయి. పాకిస్తాన్ కాశ్మీరీల కోరికకు ఏ విధంగా లొంగిరాక తప్పనిసరి అయిందో అదే విధంగా ఫక్తూన్ల కోరికకు కూడా లొంగిరాకతప్పదు," అని కాశ్మీర్ ప్రధానమంత్రి షేక్ అబ్దుల్లా ఈ వేళ సాయంత్రం ఫక్తూన్లకు రేడియోద్వారా ఒక సందేశం యిచ్చారు.

## పోలీస్, మిలిటరీ అధికార్లతో ప్రధాని చర్చల పర్యవసానం

### 'సైనిక బలాలు సిద్ధపడివుండాలి'

టెహరాన్, సెప్టెంబరు 27 : విదేశీ సైన్యాలు ఇరాన్‌లో దిగినట్లయితే, దక్షిణ ఇరాన్‌లోని పెట్రోల్ యంత్రాగారాలను అవి స్వాధీనపరుచుకోక ముందే వాటిని కాల్చి నేలమట్టం చేసెయ్యాలని ఇరాన్ ప్రధానమంత్రి డా॥ మొసాదిక్ నిర్ణయించినట్లు విశ్వసనీయంగా తెలియవచ్చింది. నిన్నరాత్రి సేనానులతోను, పోలీసు అధికారులతోను జరిపిన సమావేశంలో డా॥ మొసాదిక్ ఈ నిర్ణయం చేసినట్లుగా వెల్లడి అయినది.

బ్రిటిషు సాంకేతిక నిపుణులను బహిష్కరిస్తూ డాక్టర్ మొసాదిక్ ఉత్తర్వు జారీచేశారన్న వార్త తమకు తీవ్రమైన ఆందోళన కల్గించిందని పర్షియా ప్రభుత్వానికి తెలియచేయవలసిందిగా అమెరికా ప్రభుత్వం లాయ్ హెండర్సన్‌కు క్రిందటిరాత్రి ఒక ఆదేశం పంపింది. వాషింగ్టన్‌లోని బ్రిటిషు రాయబారి ఆలివర్ ఫ్రాంక్స్ అమెరికా విదేశాంగమంత్రి డీన్ ఆచిసన్ల సమావేశానంతరం ఈ ఆదేశం వెళ్లింది.

మొసాదిక్ జారీచేసిన బహిష్కరణ ఉత్తర్వు అంతర్జాతీయ న్యాయశాస్త్రానికి విరుద్ధమని అబదాన్‌లోని బ్రిటిషు వర్గాలు వ్యాఖ్యానించాయి.

పర్షియా, బ్రిటన్ల ఈ పెట్రోలు తగాదాను చర్చించేనిమిత్తం అక్టోబరు 4 వ తేదీకి ముందే బ్రిటిషుపార్లమెంటు సమావేశపరచబడవచ్చునని అనుకుంటున్నారు. బలిమిచేతనైనా అబదాన్‌లో తమ సాంకేతిక నిపుణులను నిలిపివుంచాలని కన్సర్వేటివులు లేబర్ పార్టీ సభ్యులుగూడా ఇదివరలో అంటూ వచ్చారు.

అక్టోబరు 3-వ తేదీఅర్ధరాత్రి లోపల అబదాన్‌లో మిగిలివున్న 300 మంది బ్రిటిష్ సాంకేతిక నిపుణులు పర్షియానువదలి వెళ్ళిపోవాలని మొసాదిక్ మొన్న ఉత్తర్వుచేశాడు. అది అయిన తర్వాత ఇవాళ యీ దక్షిణ రాష్ట్రంలోని పర్షియన్ సైన్యాలన్నిటినీ సర్వసంసిద్ధమై ఉండవలసిందని కూడా అయన ఆజ్ఞాపించాడు.

నిన్నరాత్రి పర్షియా దక్షిణమండలి మొసాదిక్ అధ్యక్షతన 3 గంటలసేపు చర్చలుజరిపింది. ఈ సమావేశానంతరం ఖుజీస్తాన్‌లోని నాకొదళ భూసైన్య సేనానులకు ఏవో ఉత్తర్వులు పంపబడినవి. పర్షియాలోని బ్రిటిషు రాయబారి షెపర్డు నిన్న పర్షియా విదేశాంగమంత్రిని సందర్శించి, ఆయన జారీచేసిన బహిష్కరణ ఉత్తరువు వల్ల పర్షియా-బ్రిటన్ల సంబంధాలు విషమించిపోగలవని హెచ్చరించాడు. పర్షియారాజును కలుసుకొని బ్రిటిష్ ప్రభుత్వం అభిప్రాయాలను స్వయంగా అయనకుకూడా తెలియచేయాలని షెపర్డు ఉద్దేశిస్తున్నాడు.

షాకు యోగ్యతాపత్రాలను కూడా సమర్పించకుండానే, టెహరాన్‌లోని అమెరికా కొత్తరాయబారి లాయ్ హెండర్సన్ ప్రధానమంత్రి మొసాదిక్‌తో నిన్న సంప్రతింపులు ఆరంభించారు. ఈ సంప్రతింపులు సుమారు 2 గంటలసేపు జరిగాయి.

వాషింగ్టన్‌లోని బ్రిటిష్ రాయబారి ఆలివర్ ఫ్రాంక్స్ నిన్న అమెరికా విదేశాంగమంత్రి డీన్ ఆచిసన్‌ను కలుసుకొనున్నాడు. పెట్రోలు వివాదంలో వచ్చిన ఇటీవలి తీవ్ర పరిణామం గురించి అమెరికా ప్రభుత్వంతో చర్చించవలసిందిగా ఆయనకు లండన్ నుంచి చాలా జరూరైన ఉత్తర్వు ఒకటి వచ్చింది.

### ట్రూమన్‌కు ప్రధాని అట్లీ అభ్యర్థన

వాషింగ్టన్, సెప్టెంబరు 27: ఇరాన్ పట్ల విశేషించి పెట్రోలు తగాదాలో రెండు ఉభయదేశాలూ ఒకే విధానాన్ని అవలంబించాలనీ, బ్రిటిషు ప్రభుత్వానికి అమెరికా ఈ విషయంలో పూర్తిగా బలాసు ఇవ్వాలనీ కోరుతూ, ప్రధాన మంత్రి అట్లీ అమెరికా అధ్యక్షునికి ఈ వేళ ఒక సందేశం పంపినట్లు తెలుస్తున్నది. పెట్రోలు వివాదంలో వచ్చిన తీవ్ర పరిణామాలనూ, ఈ పరిణామాల దృష్ట్యా ఇరాన్‌పట్ల తాము అవలంబించదలచిన వైఖరినీ అట్లీ యీ సందేశంలో వివరించినట్లు కూడా తెలుస్తున్నది.

శ్రీనగర్, సెప్టెంబరు 26 : ఇండోనీషియా మాజీ ప్రధానమంత్రి డా॥ సుల్తాన్ షహీర్ ఢిల్లీనుంచి విమానం మీద ఈ వేళ యిక్కడికి వచ్చారు. విమానాశ్రయం వద్ద షేక్ అబ్దుల్లా ప్రభృతులు ఆయనకు స్వాగతమిచ్చారు.

## ఓటర్ల జాబితాలో ఇప్పుడు చేరదలచినవారికి పద్ధతి

న్యూఢిల్లీ, సెప్టెంబరు 26 : ఓటర్‌గావుండే అర్హత ఒకానొకనికి కలదు. కాని అతనిపేరు వోటర్ల జాబితాలో లేదు ఇట్టివారు అంతిమ వోటర్ల జాబితాల ప్రచురణానంతరం వోటర్లుగా తమపేరురిజిస్టరుచేయించుకోడానికి అవలంబించాల్సిన పద్ధతిని ఎన్నికల కమిషనువారు నేడు ప్రకటించారు. ఇట్టివారు 50 రూపాయల ట్రెజరీ రసీదుతోసహా తమ దరఖాస్తులను న్యూఢిల్లీ యందలి ఎన్నికల కమిషను కార్యదర్శికి పంపుకోవాలి. దరఖాస్తుదారు చిరునామా, సాధారణంగా అతడు వుండే ప్రదేశము. వయస్సు, తండ్రిపేరు, వోటరుగా వుండడానికిఅతనిఅర్హతలు మున్నగు వాటన్నిటినీ అతడు తెలియచేయాలి. ఈ దరఖాస్తు నకలును అతడు ఏ రాష్ట్రమునకు చెందివున్నాడో ఆ రాష్ట్ర ప్రధాన ఎన్నికల ఆఫీసరుకు పంపాలి. వోటర్ల రిజిస్ట్రేషను ఆఫీసరు దానిని పరిశీలిస్తాడు. అటుతరువాత రాష్ట్రీయ ప్రధాన ఎన్నికల అధికారి వోటరుగా వుండడానికి ఆ వ్యక్తికిగల అర్హతలనుగూర్చి, ఎన్నికల కమిషన్‌వారికి సలహాయిస్తాడు.

## గాంధి జయంతి సందర్భంలో నిర్మాణ కార్యక్రమ ప్రాధాన్యం

### రాష్ట్రప్రజలకు ఆంధ్రకాంగ్రెస్ అధ్యక్షుని ఉద్బోధ

విజయవాడ, సెప్టెంబరు 26: ఆంధ్ర ప్రదేశ కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ నీలం సంజీవరెడ్డిగారు ఈ దిగువ ప్రకటన చేస్తున్నారు.

"దేశమంతటా, ప్రియబాపూజీ జన్మదినోత్సవము అక్టోబరునెల 2 తేదీ జరుగనున్నది. ఈ సందర్భమున మహాత్మాగాంధి భారతజాతికి వారి జీవితకాలమందు ప్రబోధించిన అమూల్య సిద్ధాంతములను, విధానములను విరివిగా ప్రచారముచేసి, అనుసరించుటే మనజాతి పితకు మనము సమర్పించగల శ్రద్ధాంజలి. కాన యీజాతీయోత్సవ సందర్భమున, మహాత్మాజీ, నిర్మాణ కార్యక్రమాంశములకు అధిక ప్రాధాన్యత నొసంగి ప్రచారము గావింప వేడుచున్నాను. మహాత్ముడు జీవితాంతమందు, మత ఐక్యతకై గావించిన కృషి సదాస్మరణీయము. గాన కాంగ్రెసు వాదులెల్లరు, గాంధీజీ మతకులవర్గ ఐక్యతా సందేశమును, విశ్వమానవ కళ్యాణమునకై వారి శాంతి సందేశమునకు అధిక ప్రాముఖ్యత నొసంగ వేడెదను."

"యావదాంధ్ర దేశమందు, అనాన బహిరంగ సభలు, ఉత్సవములు ఏర్పాటు గావించి, మహాత్ముని ఐక్యతా సందేశము, నిర్మాణ కార్యక్రమాంశములను ప్రజలలో ప్రచారము గావింపవలెను. నిర్మాణ కార్యక్రమాంశములలో కూడ దేశ ఆర్థిక, పునర్నిర్మాణమునకు గృహ పరిశ్రమలు, ఖద్దరు పరిశ్రమ గ్రామోద్ధరణ కార్యక్రమములు అత్యంత ప్రధానమైనవి."

"ఆంధ్ర ప్రజానీకము ఎప్పటిలాగున అత్యుత్సాహముతో ఈమహోత్సవములందు పాల్గొని, భారతజాతిపిత, మహాత్మా గాంధీజీని స్మరించ ప్రార్థన."

### కాశీ విశ్వవిద్యాలయ బిల్లు

న్యూఢిల్లీ, సెప్టెంబరు 27 : కాశీ హిందూ విశ్వవిద్యాలయ చట్ట సవరణ బిల్లునుపార్లమెంటు నేడుఆమోదించింది.

## పంటవచ్చేనాటికి ధాన్యం ధరలను నిర్ణయిస్తూ కేంద్రప్రభుత్వ ప్రకటన

### రాష్ట్ర ఆహారశాఖామంత్రి ప్రకటన

మద్రాసు, సెప్టెంబరు 27: "ధాన్య సేకరణ ధరలను గూర్చి రాష్ట్రప్రభుత్వంవారి అభిప్రాయాలను కేంద్ర ప్రభుత్వంవారు అడిగారు. ఈ నెలాఖరుకు మద్రాసు ప్రభుత్వం తమ అభిప్రాయాన్ని తెలియచేస్తుంది. అక్టోబరు ఆఖరువారంలో ఖరీఫ్ పంటధరల నిర్ణయం భారత ప్రభుత్వం చేస్తుంది మూడేండ్లుగా ధాన్యసేకరణ ధర చెన్న రాష్ట్రంలో తక్కువగా ఉన్నదని హెచ్చించవలసిందనీ, ఇతర రాష్ట్రాలన్నిటికన్న ఇక్కడ ధర తక్కువగా ఉన్నదనీ చెప్పాము. మొదట్లో కొంచెం హెచ్చుదలకు, వనక భారత ప్రభుత్వం అంగీకరించారుగాని తరువాత నిరాకరించారు. ఈసారికూడా ధాన్యసేకరణ ధర హెచ్చింప గోరగలము అని మద్రాసు ప్రభుత్వ ఆహార మంత్రి రోచ్ విక్టోరియా నేడు పత్రికా ప్రతినిధుల సమావేశం చెప్పారు.

రోచ్ విక్టోరియాగారు ఇట్లా చెప్పారు: పాలూరులో లాంఛన రేషనింగు అమలుచేసే విషయం ఆలోచనలో వుంది. విజయవాడ, కాకినాడ, రాజమహేంద్రవరం, ఏలూరు పట్టణాల్లో లాంఛన రేషనింగు అమలుచేశాం. అక్కడివారికి 8 ఔన్సుల బియ్యం, నాలుగౌన్సుల ఇతర ధాన్యాలు ఇస్తారు.

సెప్టెంబరు 15 తేదీవరకు రాష్ట్రంలో చవకదుకాణాలు 7652 ఉన్నది. వాటికితోడు రేషనింగు అమల్లో వున్న పట్టెప్రాంతాల్లో 2,855 గ్రామ రేషనింగుదుకాణాలు, 3169 చిల్లర దుకాణాలు మినులుజిల్లాల్లోను పని చేస్తున్నాయి.

రాష్ట్రంలో నిర్బంధ రేషనింగు ఉన్న ప్రాంతాల్లో 53,41,182 గ్రామ రేషనింగుక్రింద 40,93,384, రేషను రద్దుచేసిన ప్రాంతాల్లో 1,38,78,824 జనంవున్నారు. వీరందరికీ 70,642 టన్నులబియ్యం, 21,768 ట. గోధుమ, 34,788 టన్నుల ఇతరధాన్యాలు ఆగస్టుమాసంలో లెఖ్ఖ ప్రకారం అవసరమైంది.

అనంతపురం, కర్నూలు, శ్రీకాకుళం జిల్లాలో ఆహారధాన్యాలచిల్లర టోకు ధరలు సమంగా ఉన్నాయి. బళ్లారి, కడప జిల్లాల్లో టోకు, చిల్లర ధరలలో కొంచెం పెరుగుదల కనిపించింది. హొస్పేరి తాలూకా, కుప్పం, తిరుత్తని తాలూకాల్లో ధాన్యం ధర తగ్గుముఖం పట్టింది.

ఇది పంట తక్కువకాలం దేమాసాలు. ధాన్యంఉన్న పేదలకు చేతిలో డబ్బుకు చిక్కుగా ఉంటోంది. పంచవర్ష ప్రణాళిక అమలుచేసినప్పుడు ఉత్పత్తి, దానికితోడు సంపద పెరిగి, పేదలకు హెచ్చు డబ్బు లభింపగలదు.

రెవెన్యూబోర్డుకు ఎదురుగా 'అక్వేరియం' పెట్టే ఆలోచన ఉన్నదని మంత్రిగారు అన్నారు.

## 'యోగ్యతనే ముఖ్యంగా ఎంచి అభ్యర్థులను ఎన్నుకోవాలి'

### అల్పసంఖ్యాకులకు, స్త్రీలకు తగినప్రాతినిధ్యం ఇవ్వాలని ప్రదేశ్ కాంగ్రెసులకు నెహ్రూ ఆదేశం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 26 : వచ్చే ఎన్నికలలో పార్లమెంటుకు, ఇతర రాష్ట్రీయ శాసనసభలకు అభ్యర్థులను ఎంచుకోడంలో వారి యోగ్యలకు ప్రాధాన్యమివ్వాలని కాంగ్రెసు అధ్యక్షుడు నెహ్రూ ప్రదేశ్ కాంగ్రెసు కమిటీలన్నిటినీ ఆదేశిస్తూ ఒక లేఖ వ్రాశారు.

"కాంగ్రెస్ సిద్ధాంతాలకు, ఉన్నతాశయాలకుప్రతిబింబంగావుండే యోగ్యతకలవారిని మాత్రమే మనము ఎంచుకోవాలి. ధర్మనిష్ఠకల స్త్రీలను పురుషులను, శాసనసభలలో తమ బాధ్యతలను చక్కగా నిర్వర్తించగల సామర్థ్యముకలవారిని మాత్రమే మనము ఎంచుకోవాలి. బ్లాక్‌మార్కెటు వ్యాపారము మున్నగు సంఘవిద్రోహచర్యలతో సంబంధం కలవారిని మత తత్వం కల సంస్థలతో సంబంధం కలవారిని మనము ఎంచుకొనగూడదు. మైనారటీలను, స్త్రీలను తగినంతమందిని ఎంచుకోవాలి. పార్లమెంటుకు రాష్ట్రీయ శాసనసభలకు ఎన్నికలయ్యే వ్యక్తుల యోగ్యతపై కాంగ్రెస్ భవిష్యత్తు దేశ భవిష్యత్తూ ఆధారపడి వుంటవి. కనుక అయోగ్యులగువారిని మనము యెంత మాత్రము ఎంచుకొనగూడదు. పార్టీఅభిమానాలకు, వర్గాభిమానాలకు లోను కాగూడదు. కాంగ్రెసు సిద్ధాంతాలను ఆశయాలను ఆహుతిచేసి గెలవడం కంటె ఓడిపోవడమే మేలు.

### మైనారిటీలు - స్త్రీలు

మైనారటీ సంఘాలవారిని తగినంతి మందిని ప్రదేశ్ కాంగ్రెసు కమిటీలు అభ్యర్థులు గా ఎంచుకోవాలి. ఎంచుకోనియెడల సంయుక్త నియోజకవర్గాలు విఫలమైనవని, మైనారటీల క్షేమలాభాలను మనం సరిగా కాపాడజాలమని కొంతమంది విమర్శించడానికి అవకాశం యేర్పడుతుంది. ముస్లిములకు తగినంత ప్రాతినిధ్యం యివ్వాలి. సిక్కులకు, క్రైస్తవులకు, పార్శీలకు, ఆంగ్లో-ఇండియనులకు తగినంత ప్రాతినిధ్య మివ్వాలి. జనాభా దామాషా ననుసరించి యీ మైనారటీలకు ప్రాతినిధ్య మివ్వాలి. మైనార్టీల ప్రతినిధులతో సంప్రదించి అభ్యర్థులను ఎంచుకోవాలి. స్త్రీలకు గూడ తగినంత ప్రాతినిధ్యం ఇవ్వాలి. వచ్చే ఎన్నికలలో స్త్రీ వోటర్లువిస్తారంగా వుంటారనే విషయాన్ని మనం మరువగూడదు. ఈ వోటర్లు స్త్రీలకే వోటివ్వగోరడం సహజం. ప్రతిజిల్లాకు ఒక్క స్త్రీనినిలబెట్టాలని సూచిస్తున్నాను."

## భారత ప్రధాని నెహ్రూకు స్వామీజీ అర్జంటు లేఖ

### అక్టోబర్ 2కు రాష్ట్రం రాకపోతే సంకల్పించిన చర్య: వినోబాభావేవద్దకు దూతల ప్రయాణం

గుంటూరు, సెప్టెంబరు 27: స్వామి సీతారాం, భారత ప్రధాని నెహ్రూకు, ఒక అత్యవసర లేఖను పంపారు ఈ లేఖాంశాలు వెల్లడింపబడ లేదు.

కాని మిగతా విషయాలతోపాటు ఆంధ్రరాష్ట్ర నిర్మాణాలపై దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారి భావాలను యిందు ఉదహరించినట్లు తెలుస్తున్నది. అంతేగాదు అక్టోబర్ 2వ తేదీ నాటికి ఆంధ్రరాష్ట్రం సిద్ధించకపోతే, తా మవలంబింప దలచిన చర్యలనుకూడా స్వామీజీ యీ లేఖలో నెహ్రూకు స్పష్టపరచి నట్లు గూడా తెలుస్తున్నది. ఆచార్య వినోబా భావే వద్దకు శ్రీ నేతి చలపతి, పూడిపెద్ది సుబ్బారావు గార్లను, యీ సాయంత్రం ఎక్స్‌ప్రెస్‌లో స్వామీజీ పంపుతున్నారు. ఈ దూతలు తిరుపురు, వినోబాభావేను కలుసుకొన్న మీదట అవసరమైతే భారతప్రధానిని దర్శించేందుకు న్యూఢిల్లీకిగూడా వెళ్లి వచ్చునని తెలుస్తున్నది. (స్వ. వి.)

పి. టి. ఐ. విలేఖరి యిలా వ్రాస్తున్నారు :

'అక్టోబరు 2లోగా ఆంధ్రరాష్ట్రం అవతరిస్తుందనే ఆశ మీకు యింకా వున్నదా' అని అడుగగా స్వామీజీ తాను ఆశావాదినేనని సమాధానమిచ్చారు.

తమ అభీష్టం నెరవేరకపోతే పునః ప్రాయోపవేశదీక్ష పూనటంకంటే తమకు గత్యంతరంలేదని స్వామీజీ మద్రాసు ఆరోగ్యశాఖ మంత్రి కళా వెంకట్రావుగారికి విస్పష్టం చేసినట్లు తెలుస్తున్నది.

స్వామీజీ అక్టోబరు 2 తదనంతరం తాము చేయదలచిన కార్యక్రమాన్ని వివరిస్తూ ఆచార్య వినోబాభావేకు వ్రాసిన లేఖ ప్రతులను భారత ప్రధాని నెహ్రూకు, అధ్యక్షుడు ప్రసాదుగార్లకుకూడా పంపించారు.

### ఆంధ్రరాష్ట్ర నిర్మాణం

#### వెంకట్రావుగారి ప్రకటన

మద్రాసు, సెప్టెంబరు 27 : "అక్టోబరు 2-వ తేదీలోగా మద్రాసు ముఖ్యమంత్రి, తమిళ కాంగ్రెసు అధ్యక్షుల అభిప్రాయం పండిత నెహ్రూకు వ్యక్తంచేసేటట్లు యత్నిస్తున్నాము" అని మద్రాసు ప్రభుత్వ ఆరోగ్యమంత్రి కళా వెంకట్రావుగారు నేడు పత్రికా ప్రతినిధులకు చెప్పారు.

వెంకట్రావుగారు ఇలా చెప్పారు - "నిన్న రాత్రి కామరాజనాడారుగారు నన్ను కలుసుకొన లేక పోను పైవార్త పంపించారు. రెండు మూడు రోజుల్లో వారు తిరిగివస్తారు. ఒకటి రెండు తేదీల్లో వారి అభిప్రాయాన్ని పంపుతారని ఆశిస్తున్నాను. ఆంధ్రులలో 100 కి 100 పాళ్లు ఏకాభిప్రాయం ఎన్నటికీ సాధ్యంకాదు. ఆంధ్ర, తమిళ, కర్నాటక కాంగ్రెసు సంఘాలు మద్రాసు ప్రభుత్వం పంపిన అభిప్రాయాలపై భారత ప్రభుత్వం ఈ విషయంలో తమ విధానాన్ని గూర్చి ఒక ప్రకటన చెయ్యవలసి ఉంటుంది భారత మంత్రివర్గ సలహాపై ఆంధ్రరాష్ట్ర విభజన బిల్లును అభిప్రాయ సేకరణకు మద్రాసు ప్రభుత్వంద్వారా మదరాసు శాసనసభకు వచ్చిన అధ్యక్షులు పంపించాలి. వారి అభిప్రాయాలు తెలిపిన పార్లమెంటులో బిల్లు ఆమోదం పొందాలి. ఈ వ్యవహార కాండ అంతా నడచిన తర్వాత రాష్ట్రం రాగలదు. దీనికి ఇంతకన్న అడ్డుదారిలేదు"

### ప్రకాశంగారు

మద్రాసు, సెప్టెంబరు 27 : టంగుటూరి ప్రకాశంపంతులుగారిని నిన్న సాయంత్రం మద్రాసు ప్రభుత్వ ఆరోగ్యశాఖా మంత్రి కళా వెంకట్రావుగారు నర్సింగుహోంలో దర్శించారు. వారు క్రమంగా కోలుకుంటున్నారనీ, మళ్ళీ వారిని చూస్తామనీ వెంకట్రావుగారు చెప్పారు.

## దక్షిణ రైల్వే గ్రెయిను షాపులకు సరుకులను సప్లయి చేయుటకు టెండర్లు.

గ్రెయిను షాపులకు దిగువ సరుకులు సప్లయిచేయుటకు, ఒక్కొక్క జోనుకు ఒక్కొక్క సరుకుకు విడివిడిగా టెండర్లు, చేర్మన్, జాయింట్ పర్చేజింగ్ బోర్డు, సదరన్ గ్రూప్ C/o సూపరింటెండెంటు, రైల్వే గ్రెయిన్ షాప్సు, సదరన్ రైల్వే, మద్రాసు బీచిస్టేషన్ బిల్డింగ్సు మద్రాసు 1, వారిచే 22-10-51 నేద సాయంత్రము 8 గంటలవరకు తీసుకొనబడును.

2. జోన్ 1. సదరన్ రైల్వే, మద్రాసు, కావలసిన సరుకులు:

| | |
|---|---|
| (1) కందిపప్పు | (4) పెసరపప్పు |
| (2) మినపపప్పు | (5) నువ్వులనూనె |
| (3) శనగపప్పు | (6) వుప్పు |

3. జోన్ II. సదరన్ రైల్వే, తిరుచునాపల్లి: కావలసిన సరుకులు:

| | |
|---|---|
| (1) కందిపప్పు | (5) నువ్వులనూనె |
| (2) మినపపప్పు | (6) కొబ్బరినూనె |
| (3) శనగపప్పు | (7) వుప్పు |
| (4) పెసరపప్పు | |

4. టెండర్లు పెట్టదలచువారు, తమ టెండర్లను నిర్ణీత ఫారములో పంపవలెను. ఫారము ఖరీదు క్రింద రు 1/- (ఒక్కొక్క జోనుకు ఒక్కొక్క సరుకుకు) మద్రాసు, పార్కు టౌన్, సదరన్ రైల్వే పే-మాస్టరు & కాషియర్ వద్ద చెల్లించి, దిగువ సంతకముదారు ఆఫీసు నుండి షెడ్యూలు, స్పెసిఫికేషనులతో సహా టెండరు ఫారము పొందవచ్చును. టెండరు ఫారము ఒకరిది మరి యొకరికి మార్చు కొనగూడదు. దాని ఖరీదు వాపసు చేయబడదు.

నిర్ణీతమైన ప్రోఫార్మాలో ఒరిజనలులో ఇన్‌కంటాక్సు క్లియరెన్సు సర్టిఫికేటు దాఖలుచేసిననే, టెండర్లు విచారింపబడును. ఇన్‌కంటాక్సు క్లియరెన్సు సర్టిఫికేటు ప్రోఫార్మా దిగువ సంతకందారు ఆఫీసునుండి ఉచితముగా పొందవచ్చును.

పన్ను విధింపదగిన ఆదాయము లేక అందువల్ల టాక్సు క్లియరెన్సు సర్టిఫికేటు ప్రోఫార్మాలో పంపలేని టెండరుదార్లు అవిధముగా ఒక ప్రమాణ పూర్వకమైన అఫిడవిటును వ్రాసి దాని యదార్థతను గురించి అందుకు సంబంధించిన ఇన్‌కంటాక్సు ఆఫీసరుచేత గూడ సంతకముచేయించిపంపవలెను.

నోటు:- ఏ టెండరైనను అంగీకరించబడిన తరువాత, గెలుపొందిన టెండరుదారు, ఆయా జోనుకు సంబంధించిన ఆఫీసరు ఇన్-చార్జి(గ్రెయిన్ షాప్సు)గారితో కంట్రాక్టు వ్రాసుకొనవలసియున్న దనువిషయము టెండరుదారులు స్పష్టముగా తెలిసికొనవలెను.

చేర్మన్,
జాయింట్ పర్చేజింగ్ బోర్డు,
(సదరన్ రైల్వే, & బి. ఎన్. రైల్వే) సూపరింటెండెంటు ఆఫీసు, రైల్వే గ్రెయిన్ షాప్సు, సదరన్ రైల్వే, మద్రాసు బీచ్ స్టేషన్ బిల్డింగ్సు, మద్రాసు-1. 26-9-1951.



## గంటల పంచాంగం

ఖర సం॥ భాద్రపద బ॥ ద్వాదశి
1951 సం॥ సెప్టెంబరు 28 శుక్రవారం
శు॥ ద్వాదశి ఉ 6-59 మఖ రా 11-1
వర్జ్యం ప 10-13 ల 11-58 కు.
బ॥ త్రయోదశి సెప్టెంబరు 29 శనివారం
శ॥ త్రయోదశి ఉ 7-46పుబ్బ రా 12-1
వర్జ్యం ఉ 7-21 ల 9-7 కు.


# ఆంధ్రపత్రిక

ఒరులేయవి యొనరించిన నరవర,
యప్రియము తన మనంబున కగు ద
నొరులకు నవి సేయకునికి పరాయణము
పరమధర్మపథముం బెల్లన్. (మహాభారతము)

ఖర సం॥ భాద్రపద బ॥ ద్వాదశి
శుక్రవారం


## హిందూకోడ్ బిల్లు

హిందూ ధర్మస్మృతి బిల్లు తయారై ఇప్పటికి రెండుసంవత్సరాలకు పైగా అయింది. రెండు కమిటీలు ఈ బిల్లును పరిశీలించి అంతగా సవరించకపోయినా, కొంతవరకు సంస్కరించినవి. ప్రస్తుత పార్లమెంటు రద్దు గాకముందే, అవసరమైతే ప్రత్యేక సమావేశం అయినా జరిపి, హిందూకోడ్ బిల్లును శాసనం చేయిస్తామని పండిట్ నెహ్రూ ప్రకటించారు. తన ప్రభుత్వం నిలబడినా, కూలబడినా ఈ హిందూకోడ్ బిల్లును మాత్రం వదలదని స్పష్టంగా వెల్లడించారు.

కాని వారే మొన్నటిదినం, బిల్లులోని మొదటిక్లాజులు మాత్రం ఆమోదింపబడిన తరువాత, మిగతా క్లాజులపై చర్చను వాయిదా వేస్తున్నట్లు ప్రకటించారు. ఈ వాయిదా ఎంతకాలం అని శ్రీమతి దుర్గాబాయి ప్రశ్నింపగా అందుకు ప్రధానమంత్రి ఖచ్చితంగా జవాబు ఇవ్వలేకపోయినారు. అసలు ఈ బిల్లు విషయంలో ఏర్పడిన పెద్ద చిక్కు ఏమిటంటే, బిల్లుకు అనుకూలంగా ఉన్నవారు అనుకూలంగా ఉంటంతోనే తృప్తి చెందారు. ప్రతికూలంగా ఉన్నవారు బ్రహ్మాండమైన 'ప్రతిఘటన' ఉద్యమాన్ని లేవదీశారు. పార్లమెంటులో కొందరు సభ్యులు రిపబ్లిక్ అధ్యక్షుడు రాజేంద్రప్రసాద్‌గారు బిల్లుకు ప్రతికూలంగా ఉన్నారనే అభిప్రాయాన్ని కూడా కల్గించారు.

బాబు రాజేంద్రప్రసాద్‌గారు బిల్లుకు అంత సుముఖంగా లేనట్లు వారు రాజ్యాంగపరిషత్తు అధ్యక్షులుగా ఉంటున్న సమయంలో వెల్లడించిన అభిప్రాయాలే ఆధారం. ఇలాంటి ముఖ్యమైన శాసనాలు చేయడంలో కొంత నెమ్మది, ప్రజాభిప్రాయ గ్రహింపు అవసరమని వారు సలహా యిస్తూ వచ్చారు. బిల్లుపై చర్చను కాలనిర్ణయం లేకుండా వాయిదా వేస్తున్నట్లు పండిట్ నెహ్రూ ప్రకటించడంవల్ల బాబు రాజేంద్రప్రసాద్‌గారు ప్రభుత్వానికి కిట్టి సలహా ఇచ్చివుండవచ్చునని తోస్తున్నది.

ఇందువల్ల బిల్లు శాసనం కావడం కొంత ఆలస్యం కావచ్చునుగాని, బిల్లుకు అనుకూలంగా ఉన్నవారికే ఎక్కువ బలం సమకూరవచ్చు. వీరు ప్రజాసామాన్యంలో బిల్లును గురించేగాక, బిల్లు శాసనం కావడంవల్ల సమాజంలో రాగల మార్పులను గురించి కూడా ప్రచారంచేస్తే మంచిది. రాబోయే ఎన్నికల్లో ఇదొక ప్రధానవిషయం కాగల అవకాశంలేదు. ఎవరి ఎన్నికల ప్రణాళికలోనూ హిందూకోడ్ బిల్లు వివరణలేదు. కాని ఎన్నికలను అదనుగా తీసుకొని ఇందుకు సంబంధించిన ప్రచారాన్ని కాంగ్రెస్‌వారు జరిపితే వచ్చే కొత్త పార్లమెంటయినా, నిశ్చయంగా, నిస్సంకోచంగా ఈ బిల్లును శాసనం చేయకలుగుతుంది.

అసలు బిల్లులోని విషయాల కంటే, ఆ విషయాలను వివరిస్తూ అంబేడ్కర్‌గారు చేసిన ప్రసంగాలు ఈ బిల్లుకు ఇంత ప్రాతికూల్యాన్ని తెచ్చిపెట్టినవి. అంబేడ్కర్‌గారి లక్ష్యం గొప్పదే. మెచ్చుకోతగిందే. ఈ బిల్లు ద్వారా హిందూ సమాజం సాంఘిక స్వభావాన్నీ, ఆర్థిక వ్యవస్థనూ ఒక్కసారిగా మార్చివేద్దామనుకున్నారు. రాష్ట్ర శాసనసభల్లో కొందరు ప్రవేశపెట్టిన బిల్లులు శాసనాలైనవి. అదే విధంగా ఇతర రాష్ట్ర శాసనసభలలోనూ వివాహం, విడాకులు మున్నగు సాంఘిక వ్యవహారాల బిల్లులను ప్రవేశపెట్టించి, అన్ని రాష్ట్రాల్లోనూ అలాంటి సాంఘిక మార్పులను సాధిస్తే అంబేడ్కర్‌గారి పని సులభమయ్యేది, ఆ విధంగా ఎక్కువ ప్రాతినిధ్యంతో ఈ బిల్లులు శాసనాలైనట్లు చెప్పడానికే వీలుండేది.

అలా గానిపక్షంలో కేవలం ఆర్థిక వ్యవస్థను సంస్కరించడానికే పూనుకుంటే, ఇప్పటి రాజ్యాంగ నిబంధనలు చాల వనుకుంటే ఇంత ప్రాతికూల్యం ఏర్పడి ఉండేది గాదు. ఆర్థిక వ్యవస్థలో మార్పు వస్తే సంఘస్వభావం దానికదే క్రమంగా మారిపోయేదికూడా. బిల్లును ఈవిధంగానే విభజించి వేరువేరు శాసనాలు చేయదలచినట్లు అంబేడ్కర్‌గారు ప్రకటించారు. ఆ ఆలోచన మొదట్లోనే ఉంటే పరిస్థితులు ఈ విషమస్థితికి వచ్చిఉండేవికావు. ఏమైనా ప్రధానమంత్రి బిల్లును ప్రస్తుతం వాయిదా వేయడంవల్ల ఈసారి నిర్దుష్టమార్గాన్ని అనుసరించి ముందుకు పోవడానికి అవకాశం కల్గింది.

## హిందూ న్యాయశాస్త్రి సవరణ బిల్లు వాయిదా

న్యూఢిల్లీ, సెప్టెంబర్ 26: హిందూ న్యాయశాస్త్ర సవరణ బిల్లుపై చర్చను ప్రస్తుతానికి వాయిదా వేస్తూ ప్రధాని పండిత నెహ్రూ నేడు పార్లమెంటులో ప్రకటించారు. బిల్లులో మొదటి నాలుగు క్లాజులకు పట్టిన కాలాన్ని చూస్తే, ప్రస్తుత సమావేశంలో దానిని ఆమోదించటం సాధ్యం అయేట్లు కనిపించదని ఆయన అన్నారు. అందువల్ల ప్రభుత్వం ఇతర బిల్లులమీద ఎక్కువ కృషి చేయదలచినట్లు ఆయన వెల్లడించారు.

అప్పుడు దుర్గాబాయిగారు లేచి 'ఇదే పార్లమెంటులో రాబోయే సమావేశంవరకూ వాయిదా వేశారా, లేక కొత్త పార్లమెంటు చర్చకే దానిని వాయిదా వేశారా?' అని ప్రశ్నించారు.

దానికి నెహ్రూ ఈ విధంగా జవాబిచ్చారు:

"మళ్లీ అవకాశం లభించే వరకూ ఈ బిల్లును వాయిదా వేశాము. ఆ అవకాశం ప్రస్తుత పార్లమెంటు కాలపరిమితిలోనే లభిస్తుందని ఆశిస్తున్నాము. ప్రస్తుత సమావేశం అక్టోబర్ 6వ తేదీన ముగిసిపోవచ్చును. మిగిలిన కార్యక్రమాన్ని వీలయినంత త్వరలో ముగించే నిమిత్తం రేపటినుంచీ పార్లమెంటు మధ్యాహ్నం వేళ మరి మూడు గంటలసేపు ఎక్కువగా సమావేశం జరుపుతుంది. ఈ సమావేశంలో కార్మికులకు ప్రభుత్వ భీమాసౌకర్యపు బిల్లు, ప్రభుత్వ ఆర్థిక వ్యవస్థలబిల్లు, పరిశ్రమల అభివృద్ధి బిల్లులు ఆమోదించబడతవి."

## జార్జిరాజు ఆరోగ్యం

లండన్, సెప్టెంబరు 26: జార్జి రాజు నిన్న రాత్రి కొంచెం నలతగా గడిపారనీ, అయితే మొత్తం మీద ఆయన పరిస్థితి బాగా నేవుంది, నెమ్మదిగా అభివృద్ధి అవుతున్నదని రాజప్రాసాదంనుంచి వైద్యులు నేడు ప్రకటించారు.

మౌంట్ బాటెన్ దౌత్యం—6

# 'కాశ్మీర్ సమస్యపై సమితిలో భారతప్రతినిధివర్గం సామర్థ్యంతో వాదించ లేకపోయింది'

గవర్నమెంటు హౌస్ న్యూఢిల్లీ
మంగళవారం ఫిబ్రవరి 11, 1948.

కాశ్మీర్ సమస్యయొక్క విషమస్వరూపాన్ని గూర్చి లార్డు మౌంట్ బాటన్ నేను స్వీయోపాధ్యాయ బృందం ముందు వివరించారు. ఇప్పుడు ఈ సమస్యను సమితికి నివేదించడం జరిగింది. గనుక, ప్రస్తుతానికి యుద్ధభయం తొలగిపోయింది. కాని మరోవిధమైన కొత్త ఉపద్రవం ప్రాదుర్భవించేట్లుగా కనబడుతున్నది. ఈ ఉపద్రవంయొక్క స్వరూపం ఏమిటో ఇచ్చట వున్న మనకు అర్థం అయినట్లు, లండన్‌లో వున్న ప్రభుత్వానికిగాని, సమితిలో పనిచేస్తున్న ఆప్రభుత్వం ప్రతినిధులకు గాని అర్థంకాదు. భారత ప్రభుత్వం ఎన్నో అనుమానాలను పెంచుకుంటున్నది. దేశంలో రాజకీయ చైతన్యం అంటూ ఏమాత్రం వున్న ప్రజకైనా సరే అట్టే అనుమానాలే తోస్తున్నాయి. ఈ రెండు జోడైతే ఇండో బ్రిటిషు పరపతిమీద పెద్దగా ధ్వజం ఎత్తబడినా ఎత్తబడవచ్చు.

కాశ్మీర్‌లో దురాక్రమణ జరిగిందని ఇండియా సమితికి నివేదించింది. ప్రాథమికమైన ఈఫిర్యాదును గమనించడంలోనేమి, గుర్తించడంలోనేమి సమితి అనుసరిస్తున్న సాచివేత ఉపాయాలు ఇచ్చట అందరిని డోలాందోళితులను చేస్తున్నవి. కాశ్మీర్ మీద దురాక్రమణ జరిగింది అన్న విషయం ఇచ్చటవట్టిమాజువాణీ వ్యవహారం కాదు. శాంతిరక్షణ విషయకమైన సర్వస్థితులను దుస్థితికి తెచ్చే ప్రాథమిక విషయం. ఇట్టి దుస్థితి ఏర్పడకుండా చూడటానికే సమితి అంటూ సృష్టింపబడింది. అట్టి తరి ఈ సందర్భంగా ఎంతో అరమరికలతో వ్యవహరించడం చూచి, ఇచ్చటివారు ఇదిగూడా అధికార ప్రాభవం కోసంగా ఏర్పాటు చేసుకున్నటువంటి వేదికగా తయారైపోయిందన్న అనుమానం పెంచుకోడానికి సావకాశం లభిస్తున్నది. బ్రిటిష్ ప్రతినిధులేమి, అమెరికన్ ప్రతినిధులేమి, వారి వారి వైఖరులను ప్రకటించినది అంతా ఈ అనుమానానికి ఉద్బోద్బలకంగానే పర్యవసిస్తున్నది. బ్రిటిష్ ప్రతినిధి నోయల్ బేకర్ ఏమి, అమెరికా ప్రతినిధి వారన్ ఆస్టిన్ ఏమి, ఏది మాట్లాడితే అది పాకిస్తాన్‌కు అనుకూలంగానే వున్నదని, ఈ మాట్లాడ్డంలో వారు పిస్తను, శిరమును గాలికి వదిలిపెట్టారని, ఇచ్చట విమర్శలు బయలుదేరినాయి. అనుదాత్తములైన కారణాలు ఎన్నో వారు ఈ వైఖరిని అవలంబించడానికి ఆలంబనాలుగా చూపనుగూడా చూపబడినాయి.

ఈ విధంగా భారతదేశం లుప్తం భ్రాంతం అయిపోయింది. సర్వమైన భారతజాతీగూడా ఏదో మాయపొర పూడిపోయినట్లు మనసా భావించింది. అందువల్లనయిన నూత్న భావ పరివర్తన క్రమం ఒకటి దేశాన్ని విశ్వాసం లాగా ఆక్రమిస్తున్నది. ఇక వీరిమీద ఆశలు పెట్టుకొని లాభంలేదు; మన స్వతంత్రత్వం వహించో, వీరిలోను ఉపయోగించో మనని గట్టెక్కించగల్గిన దేశాలు రష్యా, తదనుయాయి రాజ్యాలేనన్న విశ్వాసం ప్రబలం అవుతున్నది. నిజానికి, కాశ్మీర్ సమస్య విషయమై ఇట్టి ఉపద్రవం కల్గిందంటే అందుకు సగంకారణం భారత ప్రతినిధి వర్గమే. అది అచ్చట సరిగ్గా తన వాదాన్ని విన్పించలేకపోయింది. తన స్థితిని తాను రూపించుకోలేకపోయింది. వారం గోజుల క్రిందటే నెహ్రూ వారిని ఇచ్చటికి పిల్పించివేశారు. సంప్రదింపు నెపంతో ఈ వెనక్కు పిలవడం జరిగిందిగాని, పునర్నిర్మాణం కోసమే ఈ పని జరిగిందని భావించడం మంచిది.

వార్తాదిక ప్రచార కలాపంలో ఇండియా సమితిలో దెబ్బతింటుందని నేను మొదటినుంచీ అనుకుంటూవున్నదే. అయినా ఇంత ఇదిగా దెబ్బతింటుందనిమాత్రం అనుకోలేదు. ఆఖరికి గోపాలస్వామి అయ్యంగారు సమితిలో ఇచ్చిన అజీర్ణపు ఉపన్యాసాలను ఇచ్చట ఈదేశంలో పత్రికలకు విడుదలచేసే విషయంలో గూడా నాలుగు, అయిదు రోజులు ఆలస్యం అవుతూ వచ్చింది. మరో విషయం ఏమిటంటే, షేక్ అబ్దుల్లా వ్యక్తిత్వం, సమితి కార్యవ్యవహారం-ఇవి సరిపడని సంగతులుగా పరిణమించాయి. అందువల్లగూడా ఇండియా సమితిలో తన ముద్రను చెల్లించుకోలేక పోయింది. అటు పాకిస్తాన్ ప్రతినిధి స్వయంగా ఆ దేశం విదేశాంగమంత్రి జఫ్రుల్లా కావడం, ఆయన శేవిని, కలుపుగోలుతనాన్ని ప్రదర్శించడం, భారతదేశం ప్రతినిధులు అశక్తులు, అసామర్థ్యులు అయివున్నట్లు కన్పించడం దీనికి తోడైనాయి. జఫ్రుల్లాఖాన్ అనుభవజ్ఞుడు. సమితిలో ఎట్లా మెలిగితే, ఎట్లా మాట్లాడితే, ఏది ఏమౌతుందో తెలిసినవాడు. ఆశక్తి భారతప్రతినిధులకు లేకపోవడం బాగా కొడిసికొట్టింది.

### గోర్డన్‌వాకర్ రాక

గవర్నమెంటుహౌస్ న్యూఢిల్లీ
సోమవారంఫిబ్రవరి23, 1948.

మౌంటు బాటెన్ మామూలుగా జరుపుతూవుండే ఉన్నతోద్యోగ బృందం సమావేశాలలో నేను జరిగిన ఒక సమావేశానికి వాల్టర్ మాంక్టన్, వి. పి. ఇద్దరూ గూడా ఆహ్వానితులై వచ్చారు. అందువల్ల సమావేశ కార్యక్రమాన్ని అవతలకు పెట్టి కాశ్మీర్ సమస్యను గూర్చి, కామన్‌వెల్తు పౌరస్వత్వాన్ని గూర్చి చర్చలు జరిపాం. కాశ్మీర్ సమస్యనుగూర్చి పూర్వాపరాలుగాని అసలు దాని తత్త్వంగాని, భారతవర్గంలోతిప్ప, తక్కిన ప్రపంచానికి ఏమీ అర్థం కాలేదని, అట్లా అర్థం చేసుకోడానికి గూడా ఆ ప్రపంచం ప్రయత్నించడం లేదని సర్ వాల్టర్ మాంక్టన్ నిర్మొగమాటంగా వాదించారు ఇంకా అధికారం అంటూ దత్తం కాకముందే అబ్దుర్‌రాబ్ నిష్తార్ ఏ విధంగా సంస్థానంభావి పాకిస్తాన్‌లో చేరడానికి వీలుగా చేరిక పత్రాన్ని గ్రహించింది, ఆ తర్వాత పాకిస్తాన్ మంత్రులు జునాఘడ్ చేరిక ఏ విధంగా ఒప్పందానికి విరుద్ధమో తెలుసుకొన్నదీ వి. పి. వివరించారు. కాక్ (కాశ్మీర్‌లో అప్పుడు ప్రధాని) జులైలో ఢిల్లీకివచ్చి పటేల్‌ను చూచారు. ప్రజల అభిమతాలకు విరుద్ధంగా కాశ్మీర్ ఇండియాలో చేరేందుకు వీలు లేదని ఆయన ఆయనకు చెప్పారు. మౌంట్‌బాటెన్ దౌరంధర్యంవల్ల కాక్ ఈ సందర్భంలో జిన్నాను గూడా చూసిటం సంభవించింది.

కామన్‌వెల్తు ప్రతిపత్తిని గూర్చి మాట్లాడుతూ మాంక్టన్ బ్రిటన్‌లోవున్న నేషనాలిటీ బిల్లుయొక్క ప్రాముఖ్యాన్ని అందరిదృష్టికి తెచ్చారు. క్రిప్సుకు మాంక్టన్ ఒక సందర్భంలో వ్రాసిన ఉత్తరంకొంతవరకు ఈ బిల్లు అవతరణకు కారణంఅనిగూడా అంటారు. పౌరస్వత్వంతో నిమిత్తంలేకుండా, ఏ వ్యక్తి అయినా బ్రిటిష్‌రాజుచేత పాలితుడు కావచ్చునని, అది ఈ బిల్లుమూలంగా సాధ్యం అవుతున్నదని ఆయన అన్నారు. ఇండియా - కామన్‌వెల్తు సమస్యనుగూర్చి మౌంట్‌బాటెన్ ఒక నివేదికను తయారు చేస్తున్నారు. దానిని త్వరలో పూర్తిచేసి, గోర్డన్ వాకర్ ఇచ్చటికి వచ్చినప్పుడు ఆయనకు అందజేయాలని, ఆయన దానిని చూడాలని, చదవాలని మౌంట్ బాటెన్ అభిమతంగా కన్పిస్తున్నది. జనవరి చివరిరోజుల్లో గోర్డన్‌వాకర్ ఇచ్చటకువచ్చి, సిలోను వెళ్లారు. ఇప్పుడు తిరిగి ఢిల్లీకి వచ్చారు. ఆయన వచ్చేటప్పటికి కాశ్మీర్ వ్యవహారం అతి విపర్యస్తమైన స్థితికి వచ్చివేసింది. యుద్ధరంగంలో అసహస్థితి ఏర్పడివుంది. లేక్‌సక్సెస్‌లో వ్యవహారం సరియైన పాకంలో నడవడం లేదు. అందువల్ల ఇప్పుడు ఈయనతో ఈ నానా విషయాలనుగూర్చి సమాలోచించడానికి, ఉపాంశ రాజతంత్రానికి కడంగడానికి సావకాశం ఏర్పడుతున్నది.

గోర్డన్‌వాకర్‌ను నేను, క్రీస్ట్ చర్చిలో చదువుకుంటున్నప్పటినుంచి ఎరుగుదును. అప్పుడు ఆయన మాకు చరిత్రాధ్యాపకుడుగా వుండేవారు. పదిహేడోశతాబ్దం ఐరోపా చరిత్ర అంతా ఎంతో చిక్కుగా వున్నట్లు వుండేది. ఆయన వాటిని విపదీని, మాకు అది అర్థమయ్యేలాగున చేసేవారు. ఇప్పుడు ఏ ఉద్యోగధర్మాన్ని నిర్వహిస్తున్నారో, అందుకు తగిన అర్హతలన్నీ ఆయనలో వున్నాయి. మనిషికి వుండవలసిన తీక్ష్ణమేధస్సు వుంది. ఘనిష్ఠమైనా ఆకర్షణీయమైనది ఆయన వ్యక్తిత్వం. ఇన్నింటికి తోడు పరిపాలనాదక్షత పుష్కలంగా ఆయనపట్ల చెల్లుబడి అయింది. అట్లే దిద్దుతున్న ఫాబియన్ సమరస భావ ప్రపంచంలో మసలుతున్న యువజన కార్మిక మేధావుల్లో గోర్డన్ వాకర్ గూడా ఒక్కరు.

కాశ్మీర్ సమస్య విషయంలో భారతపాకిస్తాన్‌లమధ్య కీలకంగావున్న విషయం ఇప్పుడు సైన్యాలను ఉపసంహరించడాన్ని గూర్చిందేనని వాకర్ అభిప్రాయం. అదీకాక జనవాక్యం విషయంలోనేమి, ముస్లింకాల ప్రభుత్వాన్ని గూర్చిన ఏర్పాటు విషయంలోనేమి, ఈ అధినివేశాల మధ్యరాజీ కూర్చడం గూడా అంతకష్టమైన విషయం ఏమీకాదని గూడా ఆయన భావిస్తున్నట్లు తోస్తున్నది. సమితిలో ఈకాశ్మీర్ సమస్యపట్ల బ్రిటిష్ ప్రభుత్వం అవలంబిస్తున్న వైఖరి ఇచ్చట ఎంతటి విరోధభావాన్ని సృష్టించడానికి దారితీస్తున్నదో, మౌంట్‌బాటెన్ ఆయన సవివరంగా చెబుతున్నప్పుడు, అందులో అతిశయోక్తి ఎంతమాత్రం లేదని గోర్డన్‌వాకర్ గ్రహించినట్లు నామటుకు నాకు తట్టింది.



గోర్డన్‌వాకర్ ఈ అన్ని విషయాలను గూర్చినీ సరిగిరిజా శంకర్ బాజ్‌పాయ్‌తో మాట్లాడారు. రష్యాతో నెయ్యమే కావాలంటే, ఆ నెయ్యం శాసించినవృత్తిని అవలంబిస్తేగాని లభించేదికాదని, అదికాక రష్యాకు ఇండియా అంతటి ఆసక్తి చూపవలసిన అవసరం ఏమీ లేదని ఈ సందర్భంలో వాకర్ నచ్చచెప్పి వున్నట్లు నాకు తెలిసింది. ఒక సారి అమెరికా రాయబారి గ్రేడీతో మాట్లాడుతూ, సర్ బాజ్‌పాయ్, కొరియా విషయం ఎత్తివున్నట్లున్నూ, ఉత్తర కొరియాకు, దక్షిణ కొరియాకు, తూర్పు, పశ్చిమ జర్మనీలకు వున్న సన్నిహిత సంబంధాన్ని ఆయన దృష్టికి తెచ్చినట్లు గూడా నేను విన్నాను. ఈ రెండుచోట్ల గూడా ఒక విభజన హద్దు, అందులో ఆ హద్దుకు ఒక వైపున అమెరికా ప్రాచుర్యంఇవిఅన్నీ వున్నాయి. కొరియాలో 38వ అంశానికి ఒకవైపున ఎట్లా చెల్లుతుందో, జర్మనీఒకవైపు ఏ నూడా అమెరికా ప్రభావం అట్లాగే చెల్లుతున్నది. ఈ విధంగా బాజ్‌పాయ్ వాదించడంచూస్తే, కొరియాను అమెరికాసైన్యాలు వదిలిపోవడానికి సిద్ధపడక పోతున్నప్పుడు, ఇండియా కాశ్మీర్‌నుంచి సైదొలగాలన్న పాలికేకలు దేనికన్న అర్థంలో సమన్వయం కుదురుతున్నది.

ఇవ్వాళ్ళ ఉదయంజరిగిన సమావేశంలో గోర్డన్‌వాకర్‌ను ఫిబ్రవరి 29 దాకా ఢిల్లీలో ఉండవలసిందిగా అర్థించాను. ఆరోజున లియాఖత్ ఢిల్లీ వచ్చే సావకాశాలు వున్నాయి. ఈసారి నెహ్రూ, లియాఖత్‌లు సమావేశమైనప్పుడు, ఒక బ్రిటిష్‌మంత్రి గూడా అచ్చటవుంటే, అదికొంతసమరసభావం, కొంతి సమయోచితపదిరేందుకు దారితీస్తుందని నాకు గట్టినమ్మకం వుంది. ఎప్పుడు మధ్యుల ప్రాచుర్యాధకాలు మంచిపని చెస్తాయో, ఎచ్చట ఆ మంచిపని సత్ఫలితాలకు దారితీస్తుందో, అచ్చట ఈ మధ్యవర్తిత్వం దుస్సాధ్యమైపోతుంది.

ఐక్యరాజ్య సమితిలో ప్రపంచఅభిప్రాయ వ్యాసంగాన్ని తనవైపుకు ఇండియా వంగించుకోవడం ఎందువల్ల సాధ్యపడలేదో స్తనకల్యపరీక్ష చేయవలసిందని నన్నుకోరారు. వివాదవిషయంలో ఇండియావాదం బాగోగులను అట్లావుంచినా, ఇండియా ప్రతినిధివర్గం యీ వాదాన్ని అచ్చటసరిగ్గా నిరూపించలేక పోయిందని, వార్తాదిప్రచారంలో ఏ ఒక నియమాన్ని ఏరు పాటించలేదని, ఒక వేళ ఆ నియమాలు ధర్మాలు తెలిసినా, వాటిని ఉల్లంఘించడమే జరిగిందని చెప్పాను. అదీ కాక పాకిస్తాన్ ఇండియాకు విరుద్ధంగా కట్టినవాదాన్ని ఖండించడానికి ఎట్టి ప్రయత్నంగాని భారతప్రతినిధివర్గం చేయలేదు. షేక్ అబ్దుల్లా ద్వారా కాశ్మీర్ మహారాజును ఇండియాలో చేరేటట్లు చూడాలని కాంగ్రెసు ఏదో పెద్దకుట్రపన్నినట్లు పాకిస్తాన్ ఒకవాదం చేసింది. ముఖ్యంగా ఆ వాదాన్ని భారతప్రతినిధివర్గం ఖండించి తీరాలి. ఆపని చేయకుండా, వదిలిపెట్టడం ఏమీ అంత మంచిది కాదు అని అన్నాను.

కాశ్మీర్ విషయమై సమితివ్యవహరిస్తున్న పద్ధతినిగూర్చి ఇచ్చట ఎంతటి విషమభావ పరివర్తన కల్గుతున్నదో అట్లే, నోయెల్ బేకర్ లుపట్టించుకొన్నట్లు కన్పించడంలేదన్న అభిప్రాయం కల్గి, మౌంట్‌బాటెన్ ఆందోళనచెందిపోతున్నాడు. సమవర్తిపద్ధతిని వ్యవహరించాలన్న వారిప్రయత్నం కొటిల్యతంత్రంలాగా భాసిస్తున్నది. షేక్ అబ్దుల్లాప్రభుత్వం ఒకమూల సాగుతు, మరోమూల ఇండియా సైన్యాలు కాశ్మీర్‌లో వుండగా అచ్చటి జనవాక్యం అన్నదానికి సమితి అధ్వర్యంలో నిర్ధరించడానికి పూనుకున్నా, ఆ జనవాక్యం నిష్పాక్షికమైనది ఎట్లా అవుతుందని లండన్‌లోవారు భావిస్తున్నారు. కాని బ్రిటన్ ఇండియాపట్ల ఇట్టిఅననుకూలవైఖరి వహించకుండా, ముందు పాకిస్తాన్ కొండజాతి ముష్కరులకు సహాయం చేయడం మానుకోవడం అవసరంఅన్న వైఖరిని అవలంబించేటంటే ఎంతో బాగుండేదని మౌంట్‌బాటెన్ భావిస్తున్నారు. అదీకాక కాశ్మీరులో చట్టబద్ధంగా ఏర్పాటుచేయబడిన ప్రభుత్వాన్ని అలావుంచి, జనవాక్యాన్ని నడిపించడం అన్నవిషయం గూడా కొంత అనుక్రోశభావంతో పరిశీలించతగినదటే ఆయన అభిప్రాయపడుతున్నారు. కాని అట్టి అనుక్రోశం సమితిలో మృగ్యం అయిపోయింది.

ఇవ్వాళ్ళ మాటల సందర్భంలో మౌంట్‌బాటెన్ అట్లీ గుణగణాలను వివరించారు. ఆయనలో ముఖ్యంగా గమనింపదగినవిషయం ఆయన వక్రమనస్క కాకపోవడంగా మౌంట్‌బాటెన్ పేర్కొన్నారు. నిజానికి ఈ భావ మర్యాదయే ఆయనకు ఎంతోపలుకుబడిని చేకూరుస్తున్నదన్నారు. ఇక అట్లీలోవున్న రెండోలక్షణం స్వాతంత్ర్య ప్రియత్వం. ఇక చెప్పుకోదగిన మరోలక్షణం ఏమిటంటే ఆయనకు ఇండియాఅంటే అపారమైన ప్రేమవుంది. ఇండియాపట్ల కుంతితముగా నిఅపేక్షవుంది. ఇవ్వన్నీ అక్షుల వంటివి. ఏకుబారాచెకేందుకు విలువలేనట్టివి అని మౌంట్‌బాటెన్ భావిస్తున్నారు. అదీకాక మౌంట్‌బాటెన్‌కు, ఇప్పుడు తాను వహిస్తున్న సలహాదారుతనం గూడా తన్ను ఇరుకున పెడుతున్న భావంతోస్తున్నది. లండన్‌కు, ఢిల్లీకి మధ్యవుండి తాను చేయగల్గింది ఏమీ లేదు. ఇకఆయనకువున్న అసరాఅట్లీరాజుగారి అసరా ఒక్కటే.

## ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెసు ఎన్నికల ట్రిబ్యునల్-

విజయవాడ, సెప్టెంబరు 26: ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెసు ఎన్నికల ట్రిబ్యునల్ సభ్యులు డి. లక్ష్మీరెడ్డిగారి అధ్యక్షతను నిన్న సమావేశమై పశ్చిమ కృష్ణాజిల్లా ఎన్నికల తగాదా పిటిషనులను విచారించి, తీర్పు ఇచ్చే నిమిత్తం తూర్పు కృష్ణాజిల్లా ఎన్నికల ట్రిబ్యునలుకు పంపాలని తీర్మానించుకొన్నారు. ఇకపై ఎక్కడ తగాదాలు వచ్చినా వాటిని ఆయాజిల్లా ట్రిబ్యునల్‌కే నివేదించాలనీ, జిల్లా ట్రిబ్యునల్ లేనిచోట్ల వచ్చిన తగాదాలైతే వాటిని మాత్రం ప్రదేశ్ కాంగ్రెసు ట్రిబ్యునల్‌కు పంపవచ్చునని, జిల్లా కాంగ్రెసు సంఘాలు ట్రిబ్యునల్‌ను ఏర్పాటు చేసుకోకపోతే ప్రదేశ్ ట్రిబ్యునల్ వారే జిల్లా ట్రిబ్యునల్‌ను నియమించగలరని ఆం. ప్ర. కాం. ఎన్నికల ట్రిబ్యునల్ వారు తెలుపుతున్నారు,

### జిల్లా ఎన్నిక ట్రిబ్యునల్స్ జాబితాలు

విజయవాడ, సెప్టెంబరు 24: ఆయా జిల్లా కాంగ్రెసు సర్వసభ్య సమావేశాలలో ఎన్నికైన జిల్లా ట్రిబ్యునల్స్ జాబితాలు వెంటనే ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు ఎన్నికల ట్రిబ్యునల్ (విజయవాడ)కు పంపవలసిందని, ఆ కార్యాలయంవారు జ్ఞాపకం చేస్తున్నారు.

### ధర్మాదాయాల అసిస్టెంటు కమిషనర్లు

మదరాసు, సెప్టెంబరు 27: ఈ క్రిందివారిని వారిపేరు కెదురుగా ఉదహరించిన డివిజన్‌లో హిందూ ధర్మాదాయాల చట్టంక్రింద అసిస్టెంటు కమిషనర్లుగ ప్రభుత్వంవారునియమించారు.

(1) శ్రీ సి. కోటేశ్వరరావు (అనంతపురం) (2) ఎ. భుజంగరావు (మచిలీపట్నం) (3) డి. గురుమూర్తిచెట్టి (విజయనగరం.)

### 1951 స్టడిబేకర్ ఛాంపియన్

మద్రాసు, సెప్టెంబరు 27: కొత్త 1951 స్టడిబేకర్ ఛాంపియన్ కారు మౌంట్‌రోడ్డులో లక్ష్మణ్ ప్రసాద్ అండ్ సన్సువారి కార్యాలయంలో నిన్న సాయంత్రం ప్రదర్శింపబడినది. ఉన్నతోద్యోగులు, వ్యాపార ప్రముఖులు మున్నగువారు అనేకులు వచ్చి ఈకారును పరిశీలించారు. జనరల్ మానేజరు శ్రీ యం. మానిక్‌లాల్, సేల్సు మానేజరు శ్రీ టి. కె. వెంకటరామన్ అతిథులను ఆహ్వానించారు. వర్క్సు మానేజరు శ్రీ టి రామస్వామి, ఇతర ఉద్యోగులు అతిథులకు కార్యాలయమంతా చూపారు.

ఈ కీగల్ డిలక్స్ నాలుగు తలుపుల సెడాన్ కారు. అతి నవీనంగా డిజైను చెయ్యబడింది. దీనిలో ఆరుమంది సౌకర్యంగా కూర్చోవచ్చును. ఇది బహుమెత్తగా పోతుంది. ఈకారు ధర గోడౌనుమీద రు. 20,300 లు అని తెల్పబడింది.

## మదరాసు ధరలు

మదరాసు, సెప్టెంబరు 27.

బంగారు-వెండి నేటిమధ్యాహ్నం 1 గంటవరకు 1.8 ఎద్దవర్తులొమ్మ పేర్పులాక్కుతోపహా రు. 77.8.0 పెట్టాబంగారు తులం 112.2.0 మూవ బంగారు 109.0.0 పీసువెండి, తులం 100.8 (శెర) 191.0.0 వెండి తులం 1.8 1.15.0

వేరుశెనగ: (531 పౌ 1.8 ఎద్దుకోపు గిడ్డంగులు మెపిన్ - పేర్పులాక్కుతో పహా)

| | |
|---|---|
| వరాని | రు. 182 183 |
| కదిరి | రు. 185 187 |

వేరుశెనగనూనె ఎద్దుపెట్టిన మీలో 3%

| | |
|---|---|
| నామినల్ (500 పౌ.) | రు. 360 |

కొంకాయ నూనె (37½ వీసెలు గల డబ్బా)

ఒకటి- వి బ్రాండ్

| | |
|---|---|
| క్రీలాక్ | రు 40.0.9 |
| యస్. బ్రాండ్ | 40 4-9 |

ఆముదం
500 వీసెలు గల ఖాడవ ఒకటికి

| | |
|---|---|
| "తిరువత్తూర్" | రు. 410.0.0 |
| నరసారావుపేట" | రు. 420-0-0 |

పంచదార

| | |
|---|---|
| షుగరాక్ | రు. 103-4-8 |
| పాలోప్టేట | రు 103-14-5 |

### బొంబై వెండి బంగారు మార్కెట్

బొంబై, సెప్టెం 27: నేటిమధ్యాహ్నం 2-30 గంటలకు బొంబై వెండి-బంగారు మార్కెటుధరలు: వెండి (100 తు) రు 188-5-0, బంగారం (తు 1కి) రు. 110-3-0, సావరిన్ 1కి రు 75-10-0.

### హైదరాబాదు (ఉస్మాన్‌గంజ్)

(వస్త్రయదారు గుర్రాల ఆశ్వత్యాగారి వెంకటేశం)

హైదరాబాదు, సెప్టెంబరు 27: బంగారం తులంకి 129-8-0, వెండి 100 రు 214.8.0. పల్లి ఒకటికి వసుపు 50-12-75 పెసలు 45-45.4-0కందులు46 48.0-0మినుములు65-65-4-0 జొన్నలు 51-8-0-52 ఒడ్లు 42.48 కందిపప్పుపెద్దది68-68-4-0కందిపప్పు చిన్నది 61-61-8.0 పెసరపప్పు 63-64 మినపపప్పు 100, 103 వేరుశనగపప్పు 95 98 ఆముదాలు 92-2-0 92-4-0చింతపండు 30-45 మిర్చి 110-160 కుసుములు 52 56ధనియాలు 16 గోధుమలు 20-22 అవాలు 12, 12.4-0బెల్లము 28-45.

## మద్రాసు సమీపంలో బైసికిల్ ఫ్యాక్టరీ

### గవర్నర్ భావనగర్ మహారాజా ప్రారంభోత్సవం

మదరాసు, సెప్టెంబరు 27: దేశంలో అత్యంత శీఘ్రంగా పెరుగుతున్న జనాభాకు పనికల్పించి జీవనోపాధి కలిగించుటకు మన పరిశ్రమలుముఖ్యంగా భారీపరిశ్రమలు విస్తృతం కావలసిన అవసరం ఎంతేనికలదని మద్రాసు గవర్నరు భావనగర్ మహారాజాగారు నిన్న సాయంత్రం అంబత్తూరులో టి. ఐ. సైకిల్సు (ఇండియా) లిమిటెడ్, ఫ్యాక్టరీ ప్రారంభోత్సవం జరుపుతూ ఉద్ఘాటించారు.

గవర్నరుగారు ఇంకా ఇట్లా చెప్పారు: "భారత పారిశ్రామికాభివృద్ధికి ముఖ్యంగా మదరాసు రాష్ట్ర అభివృద్ధి చరిత్రలో యీ ఫ్యాక్టరీప్రధానమైన మెట్టు. ఈ ఫ్యాక్టరీని ప్రధాన బ్రిటిషు పారిశ్రామిక వేత్తలు, భారత పారిశ్రామిక వేత్తలుకలిసి నిర్వహింపటూని, భారత ప్రజానీకాన్ని తీవ్రంగా బాధిస్తున్న రవాణా సౌకర్యం కలుగచేయటానికి తలపెట్టి యుండటం ముదావహం. దేశంలో పరిశ్రమలు ముఖ్యంగా భారీపరిశ్రమలు అభ్యున్నతి పొందవలసిన అవసరం ఎంతైనా కలదని నా విశ్వాసం. మనదేశంలో 38 కోట్ల జనాభాయున్నప్పటికీ మనం గర్వింపదగ్గ భారీపరిశ్రమ లేవిలేవు నాకౌనిర్మాణశాల ఒకటేయుండెనది ఇటీవలనే మోటారు భాగాలనుచేర్చి మోటారుబండ్లు తయారుచేసే ఫ్యాక్టరి ఒకటి స్థాపితమయినది ఇండియా ప్రభుత్వము యిటీవల రైలు ఇంజన్ల నిర్మాణానికి మొదటిఫ్యాక్టరీని స్థాపింపగల్గింది. దేశప్రజకు సాలుకు 375000 సైకిళ్లు కావలసి యున్నందున సైకిళ్ళ పరిశ్రమాభివృద్ధికి మిక్కిలి అవకాశం కలదని యెంచి కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలవారు యీ ఫ్యాక్టరీ నిర్మాణానికి కావలసిన దోహదం యిచ్చారు. మదరాసులో యీఫ్యాక్టరిని స్థాపిస్తూ ప్రజలకు జీవనోపాధిని చూపినందుకు కంపెనీ వ్యవస్థాపకులైన బ్రిటిషు భారతీయ డైరెక్టరుల కృషి స్తుతింపతగినది. డైరెక్టరుల ప్రయత్నము విజయవంతమగునని ఆశిస్తున్నాను.

కంపెనీ డైరెక్టరులలో నొకరైన శ్రీ ఏ. యం. యం. మురుగప్పచెట్టియార్ ప్రారంభంలో గవర్నరుగారికి స్వాగతపత్రం చదివి రజతపేటికలో సమర్పించారు. రాష్ట్రప్రజల శ్రేయోభివృద్ధియెడల గవర్నరు దంపతులు చూపుతున్న శ్రద్ధాసక్తులను వారు స్వాగతపత్రంలో స్తుతించారు.

కంపెనీ జనరలు మేనేజరు శ్రీయన్ కె. అయ్యర్‌గారు కేంద్ర మంత్రులు మహారాకృష్ణ మెహాతబ్, కే. యం. మున్షీ, జనరలు కరియప్ప, అడ్మిరల్ పార్రీ ముఖ్యమంత్రి కుమారస్వామి రాజా మున్నగువారు ఫ్యాక్టరీ ప్రారంభోత్సవ విజయాన్ని కోరుతూ పంపిన సందేశాలు చదివారు.

డైరెక్టరులబోర్డు అధ్యక్షుడు సర్ ఎ రామస్వామి మొదల్యారుగారు ఫ్యాక్టరీ ప్రారంభోత్సవం జరుపమని గవర్నరు గారిని కోరుతూ ఇలా ప్రసంగించారు "టి. ఐ. సైకిల్సు ఇండియా లిమిటెడ్ కంపెనీని కొందరు బ్రిటిష్ పారిశ్రామిక వేత్తలు భారత పారిశ్రామికులు కలిసి చేసియున్న కృషిఫలితముగా నిర్మాణమైయున్నది. సైకిలు నిర్మాణములో నిపుణులైన ట్యూబ్ ఇన్‌వెస్టుమెంట్సు హెర్కులిస్ కంపెనీలు యీ ఫ్యాక్టరీ స్థాపనకు విశేషంగా సహకరించి యున్నారు. ఇచ్చట మొదట ప్రస్తుతం సాలుకు లక్ష సైకిళ్లు విదేశాలనుండి దిగుమతిచేసే భాగాలనుండి నిర్మించి కొన్నియేండ్లలో సైకిళ్లు పూర్తిగా యీ ఫ్యాక్టరీలో నే తయారు చేయడమగును. ఈ ఫ్యాక్టరీలో తయారయ్యే సైకిళ్లు బ్రిటనులో తయారయ్యేవాటితో సరితూగగలవిగా నుండగలవని ఆశిస్తున్నాము. ఈ ఫ్యాక్టరీ పారిశ్రామిక వేత్తలు లాభాలు పొందటానికి స్థాపించినప్పటికీ ప్రజాసామాన్యానికి వృత్తులు కల్పించి జీవనోపాధిని కలుగజేస్తూ సామాన్యజనులకు ప్రయాణానికి అవసరమైన చౌకవాహనము లభింపచేయాలని తమ సంకల్పం ఇండియా ప్రభుత్వము రాష్ట్ర ప్రభుత్వము యీ ఫ్యాక్టరీ స్థాపనకు అవసరమైన ప్రోత్సాహ మొసగినందుకు కృతజ్ఞతను తెలిపారు.

ట్యూబ్ ఇన్‌వెస్టుమెంట్సు మేనేజింగ్ డైరెక్టరు సైడిబోర్డుగారు వందనము లర్పిస్తూ బ్రిటిష్ పారిశ్రామికులు భారతీయులు పరస్పర సహకార భావనుతో అన్యోన్యము గా యీ కార్యభారము తలపెట్టి యుండుట ముదావహమైయున్నదని, యీ విధంగానే భారతీయులకు బ్రిటనుకు మైత్రి సుహృద్భావాలు పరస్పరసహకారము యింకా అనేక విధాలలో వృద్ధి కాగలవని ఆశించారు.

### ఆంధ్రజిల్లాలనుంచి కాంగ్రెస్ అభ్యర్థిత్వానికి దరఖాస్తులు

విజయవాడ సెప్టెంబరు 27

రాబోవు శాసనసభల ఎన్నికలకు కాంగ్రెసు అభ్యర్థిత్వమును కోరుచు ఆంధ్రజిల్లాల నుండి ప్రదేశ్ కాంగ్రెసు సంఘమునకు మొత్తము 661 దరఖాస్తులు వచ్చినవి. వీటిలో 522 మద్రాసు స్టేటు అసెంబ్లీ స్థానములకు 56 మద్రాసు స్టేటు కౌన్సిలుకు వచ్చినవి. కేంద్ర ప్రజాప్రతినిధి సభకు 78, కౌన్సిల్ ఆఫ్ స్టేటుకు 5 దరఖాస్తులు వచ్చినవి మొత్తము దరఖాస్తులలో స్త్రీలు 26 షెడ్యూలు తరగతుల వారివి 30 ముస్లిములు 15. (స్వ. వి)

## టెండరు నోటీసు

ఆఫీసు బిల్డింగులు అండ్ స్టాఫ్ క్వార్టర్సు, రాజమండ్రి, పనికి (ఎస్టిమేటు మొత్తము రు 97,515/-) 15—10—51 తేది 3 గంటలవరకు టెండర్లు పంపవచ్చునని యిందుమూలముగా తెలియచేయడమైనది. ఇదివరకు టెండరు ఫారములు కొన్నవారు ఆ ఫారములపైనే టెండర్లు పంపవచ్చును. పి. డబ్ల్యు. డి., పి. డబ్ల్యు. డి. ఎలక్ట్రికల్ ఇంజినీరింగ్ సర్వీసు, అండ్ ... కంట్రాక్టర్లు టెండరు ఫారములు డివిజను ఆఫీసు నుంచి రు 10-2-6 లకు కొనుక్కొనవచ్చును.

ఎస్. ఎస్. వకీలు,
ఎగ్జిక్యూటివ్ ఇంజనీరు,
సి. పి. డబ్ల్యు. డి.
8, కాలేజి రోడ్డు, నుంగంబాకం, మద్రాసు 6.







# ఎన్నిక చిహ్నాల నిర్ణయం

## అసెంబ్లీ పార్లమెంటు ఎన్నికలకు

మదరాసు, సెప్టెంబరు 26: ప్రజా ప్రాతినిధ్య ప్రచట్టం (ఎన్నికల నిర్వహణ, ఎన్నిక దరఖాస్తుల) నిబంధనల క్రింద ఎన్నికల కమిషన్ జనరల్ ఎన్నికలలో ఉపయోగించుటకు 25 చిహ్నాలను నిర్ణయించి ప్రకటించియున్నారు.

ఈ 25 లో 14 చిహ్నాలను ఎన్నికల కమిషన్‌వారు ఈ క్రింది అ॥ భా॥ పార్టీలకు కేటాయించారు.

(1) కాంగ్రెసు (కాడిక్రింది వున్న ఎద్దులు) (2) సోషలిస్టుపార్టీ (వృక్షం) (3) అ. భా. ఫార్వర్డు బ్లాక్ మార్క్సిస్టు గ్రూపు (నిలుచున్న సింహం) (4) అ. భా. ఫార్వర్డుబ్లాక్ రూయికర్ గ్రూపు (హస్తం) (5) అ. భా. హిందూమహాసభ (గుర్రం) (6) కిసాన్ మజ్దూర్ పార్టీ (కుటీరం) (7) అ. భా. రామరాజ్య పరిషత్ (ఉదయభానుడు) (8) అ. భా. షెడ్యూలుజాతుల సంఘం (ఏనుగు) (9) కమ్యూనిస్టుపార్టీ (కొడవలి ధాన్యంకంకి) (10) రివల్యూషనరీ సోషలిస్టుపార్టీ (పార, గునపం) (11) రివల్యూషనరీ కమ్యూనిస్టుపార్టీ (కాగడా) (12) బోల్షివిక్ పార్టీ (నక్షత్రం) (13) కృషికార్ లోక్ పార్టీ (ధాన్యం చెరుగుతున్న రైతు) (14) అ. భా. జనసంఘ్ (దీపం.)

ఈ క్రింది 11 చిహ్నాలు రాష్ట్ర పార్టీలకు కేటాయించుటకు లభ్యంగా వున్నాయి.

(1) విల్లు, బాణం (2) రైలు ఇంజను (3) సైకిల్ (4) బండి (5) పడవ (6) పుష్పం (7) కుంజ (8) విసనకర్ర (9) త్రాసు (10) కోడి (11) ఒంటె.

పైన ఉదహరించిన అ. భా. పార్టీలతో సంబంధం లేకుండా మదరాసు రాష్ట్రంలో ఎక్కువ నియోజకవర్గాలలో అభ్యర్థులను నిలిపే వానిని రాష్ట్ర పార్టీలుగా ఎంచి ప్రధాన ఎన్నికల ఉద్యోగి చిహ్నాలను నిర్ణయిస్తారు. తమ పార్టీ అభ్యర్థులకు చిహ్నాలను కోరేవారు అక్టోబరు 8 లోగా ప్రధాన ఎన్నికల ఉద్యోగికి వ్రాయాలి. ప్రతి ఒక్క పార్టీ మూడు చిహ్నాలను ఉదహరించి ఏదో వొకదానికి ప్రాధాన్యం ఇవ్వవచ్చును. నిర్ణీత కాలంలో తెలియజేయనివారికి రిటర్నింగ్ ఆఫీసరు స్వతంత్ర అభ్యర్థులకువలెనే చిహ్నాం నిర్ణయిస్తారు.

# కాంగ్రెసు అభ్యర్థిత్వానికి దరఖాస్తులు

## ఉభయ విశాఖ జిల్లాల దరఖాస్తు దారులు

విజయవాడ, సెప్టెంబరు 24: శ్రీకాకుళం, విశాఖ జిల్లాలనుంచి ఈ దిగువవారు కాంగ్రెసు అభ్యర్థులు ఎన్నికలలో పాల్గొనదలచి ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు సంఘానికి దరఖాస్తులు పంపుకొన్నారు.

### శ్రీకాకుళం

సాలూరు: శ్రీయుతులు అల్లువిరుకు నాయుడు, దాకేటి అప్పలస్వామి, శంకరంమశెం సూర్యనారాయణదేవు.

చీపురుపల్లి: శ్రీయుతులు పంద్రంగి సత్యనారాయణ పట్నాయక్, పెద్దింటి రామస్వామి, యస్. విశ్వనాథ రాజు చీపురుపల్లి (షెడ్యూల్డ్) శ్రీ పోతుల గన్నయ్య.

బొబ్బిలి: శ్రీయుతులు కోటగిరి సీతారామస్వామి, గోన సీతారామస్వామి, చెలికాని రంగనాయకులు, యస్. గోపాలరావు, ఆర్. వెంకటనాయుడు.

పార్వతీపురం: శ్రీయుతులు ద్వారపూడి బాలరామస్వామి నాయుడు, ఎల్లా సింహాచలం నాయుడు.

శ్రీకాకుళం: శ్రీయుతులు గరిమెళ్ల కుమారస్వామి, తమ్మినేని పాపారావు, ప్రభా రామకృష్ణమూర్తి, ధామోర్ రామ్ము కృష్ణారావు (షెడ్యూల్డ్). శ్రీయుతులు గుత్తపల్లి నారాయణ, మాడుగుల సుబ్రహ్మణ్యం, మద్దెల లక్ష్మీనారాయణ, కె. నరసయ్య, కరిమిక బైరాగిదాసు.

హొంజారం: శ్రీ పైడి నరసింహ అప్పారావు.

పాలకొండ: శ్రీ పాలవలస సంగం నాయుడు.

నరసన్నపేట: శ్రీయుతులు మానుసంతులు సత్యనారాయణదొర, పొట్నూరి స్వామిబాబు, ముద్దా లచ్చంనాయుడు, కె. సూర్యనారాయణదేవ వర్మ, సిల్లా రాజులరెడ్డి, చల్లా నరసింహం.

పాతపట్నం: శ్రీయుతులు సి. యజ్ఞేశ్వరశాస్త్రి, పోడెల చంద్రయ్య నాయుడు, లుసులాఫు లక్ష్మణదాసు (షెడ్యూల్డ్) శ్రీ పప్పిక దల్లయ్యదొర.

టెక్కలి: శ్రీయుతులు రొంపి కూర్మన్న, రత్నాల రామచంద్రరావు చౌదరి, గొర్కాం రామమూర్తి.

సోంపేట: శ్రీయుతులు నౌరకల సూర్యనారాయణ, యం. కృష్ణమూర్తి పాత్ర, పట్నాయక్.

ఇచ్ఛాపురం: శ్రీయుతులు ... కృష్ణమూర్తి, చింతకింది సూర్యనారాయణ ...

విశాఖపట్నం

... సత్యనారాయణ, గోకా తిమ్మయ్య నాయుడు, ఐ. శ్రీరాములు, కుడివాడ అప్పలస్వామి.

భీమునిపట్నం: శ్రీ సింగశెట్టి సత్యనారాయణ.

అలమంద: శ్రీయుతులు సి. మాధవ వర్మ, గొర్రెపాటి బుచ్చి అప్పారావు.

శృంగవరపుకోట: శ్రీ తీగల వెంకటరమణయ్య.

చోడవరం: శ్రీయుతులు మంచం భొట్ల నరసింహమూర్తి, బి. సత్యనారాయణరాజు, మండా కృష్ణరావు, యస్. యస్. సోమయాజులు.

మాడుగుల: శ్రీయుతులు పుట్టా అనురయ్య, ఇలపకుర్తి సత్యనారాయణ, పెళ్ళా అప్పల నరసయ్యపాత్రుడు, కె. కృష్ణమూర్తి.

విశాఖ: శ్రీ సింగవరపు సూర్యారావు.

పారవాడ: బి. జి. యం. ఎ. నరసింగరావు, బి. అప్పలనాయుడు, తాటికొండ నరసింగరావు డి. ఎ. రామస్వామి.

అనకాపల్లి: శ్రీయుతులు గంధికన్నయ్యపాత్రుడు, పెంటకోట శ్రీరాములు నాయుడు.

యలమంచిలి: శ్రీయుతులు విూసాల సూర్యనారాయణమూర్తి, యం. వి. వి. సత్యనారాయణ కె. ఎస్. రామమూర్తి.

నాయకరావుపేట: శ్రీయుతులు చిక్కాల రామారావు, సాగి సీతారామరాజు, సుంకర అప్పలనాయుడు.

గొలుగొండ: శ్రీయుతులు రెడ్డి వెంకటరామయ్య, గుత్తాల లచ్చాపాత్రుడు (షెడ్యూల్డు) యం. మాచరాజు, కంకిపాటి వీరన్న పాదల్.

## తెనాలికి ఆంధ్రకాంగ్రెసు పార్లమెంటరీబోర్డు రాక

తెనాలి, సెప్టెంబరు 26: ఆంధ్ర పార్లమెంటరీబోర్డు సభ్యులు నీలం సంజీవరెడ్డి, గా॥ శ్రీ బి. గోపాలరెడ్డి, గా॥ శ్రీ కల్లూరి చంద్రమౌళి, శ్రీపల్లం రాజు శ్రీ సత్యనారాయణరాజు గార్లు నిన్నటిదినం యిచ్చటికి వచ్చారు. ఉదయం 8 గంటలనుండి గుంటూరుజిల్లా కాంగ్రెసు కార్యాలయంలో కాంగ్రెసు అభ్యర్థుల నామినేషన్ల పరిశీలన విచారణ ప్రారంభించారు. జిల్లాలోని ఆయా నియోజకవర్గాలలో నామినేషన్లు దాఖలుచేసిన అభ్యర్థులు తమతమ పరివారంతో కాంగ్రెసు కార్యాలయంలో హాజరైనారు. దాదాపు 2000ల మందిదాకా ప్రజలు వారివారి అభ్యర్థిత్వాలను బలపరచటానికి వచ్చారు. నిన్న రాత్రి 10 గంటలకు విచారణముగిసినది. ఉదయం మెయిలులో కమిటీ సభ్యులు బెజవాడకు వెళ్ళారు.

గుంటూరుజిల్లాలో 17 జనరల్ స్థానములు 1 రిజర్వుస్థానము. ఢిల్లీ శాసనసభకు 8 స్థానములు, స్థానిక సంస్థల తరఫున 1 స్థానము ఉపాధ్యాయుల తరఫున 1 స్థానము గ్రాడ్యుయేట్సు తరఫున 1 స్థానము ఉన్నాయి. యిందుకు 100 మంది నామినేషన్లు దాఖలుచేశారు. 10 మంది స్త్రీలు 15 మంది క్రిస్టియనులు, 9 మంది, హరిజనులు ఢిల్లీ శాసనసభకు ఇరువురు స్త్రీలు, ఒకమహమ్మదీయుడు మదరాస్ శాసనసభకు ఇరువురు మహమ్మదీయులు వెనుకబడినజాతుల తరఫున ముగ్గురు నామినేషన్లు దాఖలుచేసినట్లు తెలుస్తున్నది.

## తాడేపల్లి గూడెమునకు బోర్డు రాక

తాడేపల్లి, సెప్టెంబరు 26: ఎన్నికలలో కాంగ్రెసు అభ్యర్థిత్వాన్ని కోరుతూ పశ్చిమ గోదావరి జిల్లానుంచి వచ్చిన దరఖాస్తులను పరిశీలించే నిమిత్తం, ఆంధ్రకాంగ్రెసు పార్లమెంటరీ బోర్డు యివ్వాళ యిచటికి వచ్చింది.

## ఆంధ్ర పార్లమెంటరీ బోర్డులో కూర్మయ్యగారికి స్థానం

విజయవాడ, సెప్టెంబరు 27: నిన్నటినుంచీ వేముల కూర్మయ్య గారికి ఆంధ్రకాంగ్రెసు పార్లమెంటరీ బోర్డుతో సంబంధం ఏర్పడింది. తాడేపల్లి గూడెంలో జరిగిన పార్లమెంటరీ బోర్డు సమావేశం మొదలుకొని తదనంతరం జరిగే అన్ని పార్లమెంటరీబోర్డు సమావేశాలలోనూ పాల్గొనగలరు.

ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు కార్యవర్గంవారు అక్టోబరు 1 నుండి ప్రచార సంఘాన్ని నియమించనున్నారు.

పి. సత్యనారాయణరెడ్డిగారు ఆర్గనైజరుగానూ, పతానేని తిమ్మేశ్వరరావుగారు నాయకుడుగాను గల సేవాదళాన్ని కూడా నియమించారు. స్వ.వి.

## పశ్చిమ గోదావరిజిల్లా కమ్యూనిస్టు ఎన్నికల కమిటీ

తణుకు, సెప్టెంబరు 21: ఇటీవల జరిగిన జిల్లా కమ్యూనిస్టు కార్యకర్తల సమావేశంలో ఈ క్రిందివారితో జిల్లా ఎన్నికల కమిటీని ఏర్పరచిరి. గొట్టుముక్కల వెంకటరామరాజుగారు (భీమవరం) కన్వీనరు, కోటిపల్లి అప్పన్నగారు (తణుకు) పెన్మెత్స నారాయణరాజుగారు (పాలకొల్లు) ఈ కమిటీకి మరొక యిద్దరిని కోఆప్టు చేసుకొనుటకు అధికారమివ్వబడింది.

## తణుకులో కమ్యూనిస్టు ఎన్నికల కార్యాలయం

ఇచట వెల్పూరురోడ్డులో యిటీవల తాలూకా కమ్యూనిస్టు ఎన్నికల కార్యాలయమును నెలకొల్పి తాలూకా కార్యకర్తలు శ్రీ కోటిపల్లి అప్పన్న ...

# డా॥ అంబేద్కర్ రాజీనామా వదంతి నిరాధారం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 25: నిన్న హిందూ కోడ్ బిల్లులోని నాలుగవ క్లాజును పార్లమెంటు ఆమోదించిన వెంటనే న్యాయశాఖ మంత్రి డా॥ అంబేద్కర్ తన పదవికి రాజీనామా ఇస్తూ ప్రధాన మంత్రికి ఉత్తరం వ్రాశాడనే వదంతిలో ఎంతమాత్రం యథార్థం లేదని తెలుస్తున్నది.

ఒక రెండ్రోజులపాటు బొంబాయిలో వుండి మంచి వైద్యులచేత తన శరీరస్థితిని అమూలాగ్రంగా పరీక్ష చేయించుకోవాలని ఆయన కోరుతున్నట్లు కొన్ని రోజుల క్రిందట ఈ విషయమై ఆయన ప్రధాన మంత్రికి ఒక లేఖ వ్రాస్తూ, వీలైతే తనను మంత్రి పదవినుండి విడిచిపెట్టవలసిందనీ కూడా సూచించినట్లు మాత్రం అందరికీ తెలిసిన విషయమే. కాని అంబేద్కర్ గారు తాను ప్రవేశపెట్టవలసివున్న బిల్లులన్నీ ప్రవేశపెట్టి అందుకు సంబంధించిన పనిఅంతా పూర్తి చేసిగాని బొంబాయికి ప్రయాణం కావాలని కోరటం లేదు.

## తిరుపతిలో కలరా ప్రమాదం

తిరుపతి, సెప్టెంబరు 26: తిరుపతిలో కలరా ప్రమాదం సంభవించేట్లున్నదని చిత్తూరు జిల్లాకలెక్టరు పి. రామచంద్రన్ గారు ప్రకటించారు. ఈ ప్రమాదం సంభవించకుండా తగు జాగ్రత్త చర్యలన్నీ తీసుకోవాలని పురపాలక సంఘ ఆరోగ్యాధికారిని కోరారు.

బ్రహ్మోత్సవానికివచ్చే యాత్రీకులంతా, కలరా నివారణ ఇంజక్షన్లు తీసుకొనిరావాలని పురపాలక సంఘ అధికారులు ప్రకటించారు.

# క్రీడా రంగం

## నేషనల్ ఫుట్‌బాల్ ఛాంపియన్ షిప్పు

బొంబాయి, సెప్టెంబరు 26: నేషనల్ ఫుట్‌బాల్ ఛాంపియన్ షిప్పునందు నేడు బెంగాలు జట్టు, మద్రాసు జట్టును 2-0 గోలులతో ఓడించి సెమీఫైనల్సుకు వచ్చారు. ఇప్పుడు శుక్రవారం నాడు బెంగాలు జట్టునకు, హైదరాబాదు జట్టునకు సెమీఫైనల్సు ఆట జరుగుతుంది. నేటి ఆటలో మద్రాసు జట్టు మంచి నైపుణ్యం ప్రదర్శించింది గాని, అదృష్టం లేక పోవటంవల్ల ఓడిపోవలసి వచ్చింది. విశేష ప్రతిభ చూపించుతు ఉన్నటువంటి గోవిందన్ కాలికి దెబ్బ తగులుటచే తర్వాత ఆడలేక పోయాడు. మద్రాసు గోలీ మునుస్వామి ఎన్నో గోలులు కొట్టకుండా ఆపినాడు.

## ఇంటర్ యూనివర్సిటీ ఫుట్‌బాల్ రేడియో సమీక్ష

కటక్, సెప్టెంబరు 26: ఇక్కడ రేపు ఇంటర్ యూనివర్సిటి ఫుట్‌బాల్ దక్షిణ ప్రాంత ఫైనలు ఆట జరిగే సందర్భంలో కటక్ రేడియో స్టేషను ఆట సమీక్షను ప్రసారం చేస్తుంది. ఈ ఫైనలు ఆటలో మద్రాసు నాగపూరులు ఆడుతవి. రేడియో సమీక్షను 221.4 మీటర్లపై వినవచ్చును.

## పూనా శిబిరంలో క్రికెటుఆట

పూనా, సెప్టెంబరు 26: ఇక్కడ క్రికెటు శిక్షణ శిబిరంలో మర్చెంట్ జట్టునకు, హజారేజట్టునకు జరుగుతున్న క్రికెటు ఆటయందు హజారే జట్టునకు మొదటి ఇన్నింగ్సులో ఆధిక్యత లభించెను. మర్చెంట్ జట్టు 14 వికెట్లకు 234 పరుగులుచేసి డిక్లేర్ చేయగా నేటిఉదయం హజారేజట్టు బాటింగుచేయుట మారంభించి సాయంకాలం ఆట నిలిపివేసే సమయానికి 4 వికెట్లు నష్టమునకు 236 పరుగులు చేశారు. ఎం. ఆర్. రేగే 27, పి. రాయ్ 96, రుస్సీమోడి 58, పరుగులు చేశారు. హజారే 24 పరుగులతో అవుటు కొకుండా ఉన్నాడు.

## నెల్లూరులో క్రికెటుఆట

నెల్లూరు, సెప్టెంబరు 26: ఇక్కడ మొన్న ఆదివారంనాడు నెల్లూరు క్రికెటుక్లబ్బు జట్టునకు బర్మాషెల్ జట్టునకు జరిగిన క్రికెటు ఆటయందు మొదటిజట్టు గెలుపొందెను. స్కోరు వివరాలు నెల్లూరు క్రికెటుక్లబ్బు 89, (ఎం. లోకాభిరామన్ 30, సి. వి. పార్థసారథి 22, పరుగులకు 5, వికెట్లు ఎన్. గోపినాథ్ 43 పరుగులకు 5, వికెట్లు తీసుకొన్నారు.) బర్మాషెల్ జట్టు 74 (టి. ఎన్. బాలసుందరం 24 ఎన్. వి. రాజగోపాలన్ 16 పరుగులకు 4, రత్నాకర్ రాయ్ 24 పరుగులకు 8, వి. పాండే 21 పరుగులకు 3 వికెట్లు తీసుకొన్నారు.)

# రేడియో

## సెప్టెంబరు 29 శనివారం

### విజయవాడ

ఉ. 7-0 తెలుగున వార్తలు 7-15 మద్రాసు (బి) వలె 7.30 మద్రాసు (ఎ) వలె 8-0 ఆంగ్లమున వార్తలు.

మ. 1-0 మద్రాసు (బి) వలె 1-30 మద్రాసు (ఎ) వలె 1-40 హిందీలో వార్తలు 1 50 తెలుగున వార్తలు 4 0 వనితావాణి ...

... సాయంకాలం ... శేషావతారం 7.45 గీతమంజరి (బి) టి. సూర్యకుమారి 8-0 గయోపాఖ్యానము నాటిక ... లక్ష్మీనరసింహంపంతులు ... బి. వి. రంగారావు గయుడు ... 9-0 ఆంగ్లమునవార్తలు 9-15 చిత్రవాణి (బి) 9-30 ముగింపు.

### మద్రాసు (ఎ)

ఉ. 7-0 స్వాగతము 7-30 టి. వి. పెంబు అయ్యర్ 8-0 అంగ్లమున వార్తలు.

మ 1-0 మహిళామండలి జాతీయగేయము ... గానమంజరి (బి) 4-0 (బి) వలె.

సా. 5-30 ఆర్. శారద వీణ 6-0 ఆంగ్లమున వార్తలు 6-10 స్థానిక ప్రకటనలు ... 7-0 ఫిలిం సంగీతం (బి) 7-30 తమిళమున ప్రసంగం 7-45 ... 9-0 ఆంగ్లమునవార్తలు 9.15 ఆంగ్లమున ఆటల సమీక్ష 9-30 (బి) వలె 10-0 పాశ్చాత్య సంగీతం (బి) 10.30 ముగింపు.

### మద్రాసు (బి)

ఉ. 7.0 తెలుగున వార్తలు 7-15 ఉదయగానము (బి) టి. వి. వసంత ఎం. ఎస్. సుబ్బలక్ష్మి 7-30 ... 8-0 (ఎ) వలె.

మ. గీతమంజరి (బి) ... 1-30 ఆంగ్లమున వార్తలు 1-40 ఫిలిం సంగీతం (బి) 1 50 తెలుగున వార్తలు 2 వేణువు ... 2.15 పిల్లల కార్యక్రమం తమిళమున 4-0 ఆంగ్లమున పిల్లల కార్యక్రమం 4 30 పాశ్చాత్య సంగీతం (బి)

సా. 5-30 (ఎ) వలె 6-20 ... 6.30 గ్రామస్థుల కార్యక్రమం ... 7-0 తెలుగున వార్తలు 7-15 గ్రామస్థుల కార్యక్రమం సినిమా సంగీతం (బి) 7-30 ... 7-45 (ఎ) వలె 9.30 ... 10-0 శాస్త్రీయ సంగీతం (బి) 10.30 ముగింపు.

### హైదరాబాద్

ఉ. 7-0 తెలుగున వార్తలు 7-15 తెలుగు హిందీలలో ... 8-0 ఆంగ్లమున వార్తలు 8.15 ... 8-40 ...

మ. 12.30 ... 1-0 ... (బి) 1-10 ... (బి) 1.30 ఆంగ్లమున వార్తలు 1-40 ... (బి) 1-50 తెలుగున వార్తలు.

సా 5-30 కన్నడమున కార్యక్రమం 6-0 ఆంగ్లమున వార్తలు 6-10 స్థానిక ప్రకటనలు 6-20 ఉర్దు ప్రసంగం 6.30 ... 7.0 తెలుగున వార్తలు 7-15 గ్రామసీమ ... 8.15 ... 8-30 ... 9.0 ఆంగ్లమున వార్తలు 9.15 హిందీలో వార్తలు 9-30 ... 9-45 ... 10-0 ... 10-15 ముగింపు

## కార్పొరేషను బ్యాండు

మద్రాసు, సెప్టెంబరు 27. రేపుసాయంకాలం ఐదున్నరగంటలకు మెరీనాలో ఓల్డు బాండ్ స్టాండ్ వద్ద కార్పొరేషను బ్యాండు వాద్య సమ్మేళనం ఉంటుంది.

## ప్రభుత్వస్త్రీఉద్యోగులకుహాస్టలు

మద్రాసు, సెప్టెంబరు 25: ప్రభుత్వం క్రింద పని చేసే అవివాహిత స్త్రీ ఉద్యోగుల నిమిత్తం 1 లక్ష 59 వేలతో ఒక హాస్టలు నిర్మించుటకు ప్రభుత్వం వారుమంజూరు చేశారు.





## దక్షిణ రైల్వే.

ఈ రైల్వేకుచెందిన బండ్లు రాకపోకల వేళలు 1951-వ సం॥ అక్టోబరు 1-వ తేదీనుండి కాక, 1951-వ సం॥ నవంబరు 1-వ తేదీనుండి మార్చబడును.

విశాలాంధ్రలో అన్ని ముఖ్య కేంద్రములలో

# నేడే చూడండి!

...శ్రీ జ్ఞానాంబికా వారి...

# మంత్రదండం

జయమ్మ, శ్రీరంజని, సి. హేమలత, కృష్ణకుమారి, బాలసరస్వతి.
నాగేశ్వరరావు, సి. యస్. ఆర్. శివరావు, రామమూర్తి, లింగమూర్తి.
నిర్మాత: సి. కె. సి. చెట్టి, దర్శకుడు: కె. యస్. రామచంద్రరావు,.......

## (కథా సంగ్రహం)

మగశిశువును కని పెద్దరాణి చనిపోగా చిన్నరాణి ఆ మగశిశువును చంపి అడవిలో పారేయమని ఒకరిని పంపుతుంది. కాని మాతృదేవతా మహిమవల్ల ఆ శిశువు ఒక యోగిని దగ్గర చేరి శివప్రసాద్ అనే పేరుతో పెద్దవాడయి ఆశ్రమవాసంలో ఓషధికై పోతూ, పూలదండలమ్మే గౌరి అన్న పిల్లను చూస్తాడు. వారిద్దరూ మొదటి చూపులోనే ప్రేమించుకుంటారు. దీనివల్ల ఆ గౌరిని పెళ్ళి చేసుకుందామనుకున్న సాంబయ్యకూ శివప్రసాద్‌ని ప్రేమిస్తున్న గిరిజ అన్న ఆశ్రమవాసికీ యిద్దరికీ ఆశాభంగం కలుగుతుంది. దీని ఫలితంగా శివప్రసాద్, గౌరి ఒకరికి తెలియకుండా ఒకరు అడవుల వెంట పోతారు

పట్టపేనుగు పూలదండ వెయ్యటంవల్ల శివప్రసాద్ తన తండ్రిరాజ్యానికే రాజవుతాడు. గౌరి ప్రమాదంలో పడి, చిన్నరాణి అంతఃపురంలో చేరుతుంది. ఆశాభంగంతో గిరిజకూడా అడవులలో పడి చిన్నరాణికి భూతవైద్యుడుగా ఉపకరిస్తూవున్న టింటాకరాళుడన్న మాంత్రికుడి గుహ చేరుకుంటుంది.

చిన్నరాణి తమ్ముడు చేసిన దొంగతనానికి, గౌరిమీద నేరంమోపి దాచిస్తారు. నిర్దోషని తెలిసినా, శివప్రసాద్ గౌరికి కారాగారశిక్ష విధించవలసివస్తుంది. నగలు దొరికిన తరువాత అతడు గౌరిని విడుదలచేసి, రేపే మహారాజావారితో చెప్పి తన్ను వివాహమాడుతానని చెప్పి గౌరిని సంతోషపెడతాడు. వీరి సంభాషణ వింటూవున్న మహారాజు శివప్రసాద్‌ని మందలించి, గౌరిని ఆరాత్రే దేశం విడిచిపో వాలని ఆజ్ఞాపించాడు. ఇంతలో శివప్రసాద్ ఆ పెద్దరాణి కొడుకని, గుండెమీద పుట్టుమచ్చవల్ల గ్రహించి దుర్గ చిన్నరాణితో చెపుతుంది. వాడు మాంత్రికుడితో చెప్పగా మాంత్రికుడు గిరిజచేతికి మంత్రదండాన్నిచ్చి ఆ యువరాజును మాయంచేసి, తన గుహకు తెప్పించుకుంటాడు. యువరాజును గౌరి తీసుకుపోయిందని మహారాజు భటులను పంపి గౌరిని చెరలోపెట్టి ఏడురోజులగడువులో యువరాజు ఉనికి చెప్పకపోతే ఉరిశిక్ష అని ఆజ్ఞాపిస్తాడు.

అక్కడ గిరిజ తాను మాయంచేసి తెచ్చినవాడు తాను కోరిన శివప్రసాదేనని గ్రహించి మెల్లగా మంత్రదండం సంగ్రహించి దాని ప్రభావంవల్ల శివప్రసాద్‌తో తానెక్కడికో పోయి, అతడు గౌరిని ప్రేమిస్తున్నాడని తెలిసి, ఆ గౌరినే భూతమార్చాలన్న ఉద్దేశంతో కోటకు వచ్చి, మంత్రదండాన్ని ఒకచోటదాచి, పరిస్థితులు తెలిసి కోటానికి వెళుతుంది. ఇంతలో రాణి తమ్ముడు ఆ మంత్రదండంచూచి ఏమిట్లో అని పరీక్షిస్తుంటాడు. ఈ పరీక్షనూ ఆ దండాన్నీ చూచి మహారాజు మంత్రి అతనిని ప్రశ్నిస్తారు. వాడు చెప్పిన అవకతవక జవాబులలో, విచారణా, దుర్గ నిజంచెప్పడమూ, ఈ మాటలు వింటూఉన్న చిన్నరాణి ఆత్మహత్య చేసుకోవడమూ, రాజు భటులనుపంపించి ఆ గుహ వెదికించడమూ, అక్కడున్న వారందరినీ చెరలో పెట్టించడం జరుగుతుంది. మంత్రదండంలేక మాంత్రికుడు క్షుద్రుడయి కోటనుంచి తిరిగి వస్తున్న గిరిజను తెచ్చిగుహలో బంధించి యువరాజుకోసం తిరుగుతూ అతడిని మోసంచేసి పట్టుకుని తన దేవతకు బలియివ్వడానికి గుహకు తోడుకుపోతాడు. మహారాజు పిచ్చివాడిలాగా తిరుగుతూ యోగినినిచూచి శివప్రసాదు సంగతి చెపుతాడు. యోగిని మాంత్రికుడు చేస్తూవున్న పని గ్రహించి, శివప్రసాదుకు దెబ్బతగలకుండా కాపాడుతుంది. గదిబిడివి గుహలో ఖైదీగా వున్న గిరిజ బయటకువచ్చి శివప్రసాదును రక్షించటానికి తన ప్రాణాలు బలియిస్తుంది. ఇంతలో యోగినితో మహారాజు వస్తాడు. మాంత్రికుడు చస్తాడు. యువరాజు గౌరికోసం అంగలారుస్తాడు. ఏడురోజుల గడువైపోయింది. కాబట్టి గౌరి నిక్కడ ఉరితీస్తారు......................... కొదవ తెరమీద.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| విజయవాడ | — | దుర్గాకళామందిరం | విజయనగరం | — | మినర్వా | వరంగల్ | — | ప్రభాకర్ |
| తెనాలి | — | శ్రీ రామా | విశాఖపట్టణం | — | లక్ష్మి | రాయచూరు | — | రంజిత్ |
| గుంటూరు | — | ప్రభాకర్ | ఒంగోలు | — | శ్యాంప్రసాద్ | భీమవరం | — | మారుతి |
| మచిలీపట్నం | — | బృందావన్ | సికింద్రాబాద్ | — | పారమౌంట్ | | | |
| ఏలూరు | — | కేసరి | | | | | | |
| రాజమండ్రి | — | మినర్వా | | | | | | |
| కాకినాడ | — | మినర్వా | | | | | | |

**6-10-51 విడుదల**

బళ్లారి, కర్నూలు, అనంతపురం, చిత్తూరు, నెల్లూరు, బెంగుళూరు, మైసూరు వగైరా.

SRI GNANAMBIKA PICTURES MADRAS

CH. E. PRASAD

"దిప్రతిభా రిలీజ్"

స్టుడియో: వాహిని

డిస్ట్రిబ్యూటర్లు:

ఆంధ్ర: ప్రతిభా పిక్చర్సు డిస్ట్రిబ్యూటర్సు, విజయవాడ.
నైజాం: ప్రీమియర్ పిక్చర్స్, సికింద్రాబాద్.
దత్తమండలాలు: శ్రీ కైలాస్ టాకీ డిస్ట్రిబ్యూటర్సు, గుంతకల్లు.
మైసూరు: మురళీ పిక్చర్సు, బెంగుళూరు.
విశాఖమండలం: ప్రతిభా పిక్చర్ డిస్ట్రిబ్యూటర్సు, విజయవాడ.

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, Madras.